## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120033145

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Author's Last Name

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్.

పరబ్రహ్మణేనమః

శ్రీమదాపస్తంబ మహర్షయేనమః

# యాజుషాపరప్రయోగానుక్రమణిక.

(బ్రహ్మమేధప్రయోగ సహితము.

ఆహితాగ్ని, అనాహితాగ్ని; యత్యాపరప్రయోగ

స్వరసహిత ధర్మశాస్త్రాది విషయములు గలవు.

ఈ గ్రంథము

కీ॥ శే॥ నా తండ్రిగారైన

**చల్లా లక్ష్మీనరసింహ శాస్త్రిగారిచే**

వ్రాయబడి వారి జ్యేష్ఠ కుమారుడైన

సుబ్బరాయశాస్త్రిచే

స్వకీయ

శ్రీ లక్ష్మీనరసింహ ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపబడియె

మచిలీపట్టణము.

అష్టమముద్రణము.

1967



వెల రు. 6—50

పోష్టుఖర్చులు ప్రత్యేకము

## సంస్కార ప్రయోగ వైషమ్యములు.

1. అహితాగ్నేః బ్రహ్మవిత్త్వే బ్రహ్మమేధ సహిత పితృమేధ అహితాగ్ని సంస్కారః॥
2. అహితాగ్నేఃఅబ్రహ్మవిత్త్వేపితృమేధసహితఅహితాగ్నిసంస్కారః
3. అనాహితాగ్నేఃబ్రహ్మవిత్త్వేబ్రహ్మమేధసహిత పితృమేధసంస్కార
4. అనాహితాగ్నేఃఅబ్రహ్మవిత్త్వే కేవలపితృమేధ సంస్కారః॥

---

1. అహితాగ్ని బ్రహ్మవేత్తయైనచో బ్రహ్మమేధముతో గూడినపితృమేధము సంస్కారము జరుపవలెను.
2. అహితాగ్ని బ్రహ్మవేత్తగానిచో పితృమేధ సహిత సంస్కారవే జేయవలయును
3. అహితాగ్ని కానివారు బ్రహ్మవేత్తయైనచో బ్రహ్మమేధ సహిత పితృమేధసంస్కారమునే జేయవలయును.
4. అనాహితాగ్ని బ్రహ్మవేత్తకానిచో కేవలము పితృమేధసంస్కార ప్రయోగమే చేయవలెను.

—( ० )—

## విజ్ఞప్తి.

పితృమేధప్రశ్నయందు పాపులను శిక్షించునట్టి రాజగు యమునికి హవిస్సుల నిచ్చి సంతోషపెట్టుడు అని చెప్పియున్నది. మృతి చెందిన పిత్రాదులు అకృత్యములనొనర్చి అధోగతి నందియున్నను వారి నుద్దేశించి పుత్రాదులు యథాశాస్త్రముగ పితృమేధమును ఆచరించిన యెడల వారు సద్గతిని పొందగలరని శ్రుతిస్మృతులందు ఘంటాఘోషముగ వక్కాణించియున్నది. పుత్రాదులు చేయు పితృమేధ సంస్కారమువలన ప్రేతకు వసుత్వము, రుద్రత్వము, ఆదిత్యత్వముకలిగి పిదప దేవత్వముసిద్ధించుననియు, శాస్త్రమునందుసుప్రసిద్ధముగాగలదు.

ఈపైత[illegible]మేధికము ఈగ్రంథము ధర్మశాస్త్ర ప్రమాణవచనములతోడన[illegible] దేహవిషయములందు సవిమర్శముగ వేదపరిజ్ఞాతులచేత పరిష్కరి[illegible]యూర్పు ముద్రించినాము.

# పీ ఠి క

జననీ జనకులు మృతినొందిన సమయమునందు పుత్త్రులు ప్రేత
కర్మములనుజక్కఁగనియమయుతముగ నెఱవేర్చి రేనివారు (ఆజననీజన
కులు) తమ పుత్త్రాదులొనరించిన దానాదికర్మములకు విధింపఁబడిన పుణ్య
లోకములను బొందుదురు. మఱియువారు పితృదేవత్వము గలవారగు
దురు. వారట్లగుటచే వారానందమునుబొంది తమపుత్త్రులు దీర్ఘాయు
ష్మంతులును, తేజోవంతులును, ధనవంతులును, అగునటులాశీర్వచన
ములను జేయుదురు ఆయాశీర్వచన సామర్థ్యంబున పుత్త్రులు సుఖ
వంతులై యుందురు.

శ్లో॥ పితౄణాంచప్రసాదేన కర్తుర్వంశోభివర్ధతే ।
శ్రేయసాంచాభివృద్ధిస్స్యాద్భూయసాముత్తరోత్తరమ్॥

తా॥ పితృదేవతలయొక్క యనుగ్రహముచేత పుత్త్రాదులయొ
క్క వంశమభివృద్ధిని బొందుటయేగాక గొప్పదగు శ్రేయస్సుకలుగును.

అయ్యా! ఈకలిప్రాబల్యమువలన బ్రహ్మవేత్తలు అహితాగ్నులు
మొదలగు వారలెక్కడనో బహుస్వల్పముగా నుందురు. అందువలన
బ్రహ్మమేధసంస్కారము, అహితాగ్నిసంస్కారము, క్రమముగా తగ్గి
యుండెను. ఇప్పుడుసర్వేసర్వత్రాఅనాహితాగ్నుల సంఖ్యయేవృద్ధిగా
నుండెను, ఈ విషయములన్నియును సుజనులకందరికిని దెలిసినవిషయమే
యగుట విస్తరింపఁబడలేదు. అపస్తంబముని జేసిన శ్రౌతపన్నములేదు,
గృహ్యసూత్రములేవియి యావచ్ఛుభ కర్మములను గురించినవే కాని మరి
యొకటికాదు. (అనఁగా ఔపాసనము మొదలుకొని యశ్వమేధాంత
క్రతువులను, నిషేకాది శ్మశానాంతములైన షోడశ కర్మలును చెప్ప
డినవి.) అయితే ఆపస్తంబముని శుభమును బోధించిన తన వాక్కుచే
శుభమును బోధింప సమాధానము లేనందున తన శిష్యుఁడైన భర
ద్వాజమునిచే భారద్వాజ సూత్రము రచియింపఁబడెను. ఆ భారద్వాజ
సూత్ర ములో ఔర్ధ్వదైహికమును, బ్రహ్మమేధ సంస్కారమును జెప్పఁ
బడినవి, ఔర్ధ్వదైహిక కర్మమునకు పైతృమేధికమని పేరు, పైతృమేధి
కమనఁగా చనిపోయిన బ్రాహ్మణాదులకు దహనసంస్కారము మొదలు
కొని సపిండీకరణాంతము వఱకును జేయుకర్మమని యభిప్రాయము.

శ్లో॥ జ్ఞాత్వాకర్మాణికుర్వీత॥

అని యుండెను. కాలము తెలిసి కర్మమాచరింపఁదగును. ఈ కలికాల మహిమవలన గొందరు పుత్త్రులు మాతా పితరులను సదా దూషింపుచు వారు మృత్యులైనవెనుక వారికిసకాలమందు శ్రాద్ధములఁ జేయక మా తల్లిదండ్రులుఁ తినవచ్చినారా పురోహితుల కొరకీశ్రాద్ధము లేర్పడిన వనెడు ముఖ్యాభిప్రాయము.

శ్లో॥ పున్నామ్నోనరకాద్యస్మాత్పితరంత్రాయతేసుతః।
తస్మాత్పుత్త్రఇతి ప్రోక్తస్స్వయమేవస్వయంభువా॥

తా॥ అనఁగా ఏకారణమువలన పున్నామ యను నరకము నుండి తండ్రిని రక్షింపుచున్నాడో ఆకారణమువలన పుత్త్రుఁడను స్వయముగా బ్రహ్మచే జెప్పఁబడెను.

శ్లో॥ జీవతోర్వాక్యకరణా త్ప్రత్యబ్దంభూరిభోజనాత్ ।
గయాయాంపిండదానాచ్చ త్రిభిఃపుత్త్రస్యపుత్రతా॥

తా॥ అనఁగా తల్లిదండ్రుల యాజ్ఞ ననుసరించుటయు ప్రత్యాబ్దికము లందన్నదానము చేయుటయును గయయందు పిండ ప్రదాన మిచ్చుటయును ఈ మూఁడు కార్యములు నాచరించుటచే పుత్త్రుఁడు పుత్త్రధర్మమును బొందినవాఁడగును.

శ్లో॥ నాస్తిమాతృసమందైవం నాస్తిపితృసమోగురుః।
తయోర్నిత్యంప్రియంకుర్యా త్కర్మణామనసాగిరా॥

తా॥ తల్లితో సమానమైన దైవంబును, తండ్రితో సమానమయిన గురువును, లేరు కనుక నెల్లప్పుడు త్రికరణశుద్ధితో ననఁగా మనోవాక్కాయము లొకటిగాఁగా వారికిప్రియముగ నడుచుకొనుటయే పుత్త్ర లక్షణము.

శ్లో॥ అపుత్త్రస్యగతిర్నాస్తి స్వర్గోనైవచనైవచ।
తస్మాత్పుత్త్రముఖందృష్ట్వా భవేత్పశ్చాద్ధితాపసః॥

శ్లో॥ మృతాహంతుపరిత్యజ్య చండాలఃకోటిజన్మసు॥

శ్లో॥ దరిద్రాయకృతందానం శూన్యలింగస్యపూజనమ్ ।
అనాథప్రేతసంస్కార మశ్వమేధసమంవిదుః॥

దిక్కులేనిశవమును దహనము చేయుటచే అశ్వమేధయాగఫలంకలుగును.

ఓం పరబ్రహ్మణేనమః.

# యాజుష అపర ప్రయోగానుక్రమణిక

## అథాదౌ నక్షత్ర శుభాశుభ ప్రకరణమ్.

### మృతికి మంచినక్షత్రములు.

జ్యోతిస్సంగ్రహే॥ శ్లో॥ మృతతిథిషుయదాస్యాత్ సోమసౌమ్యార్యవారా। న్యతిశుభఫలదాని ప్రోచ్యతేథర్క్షవిప్రైః। తురగభరణీపుష్య స్వాతిహస్తార్ద్రమిత్ర। శ్రవణజలసమేతాః జ్యేష్ఠమూలాస్తథైవ భుజగమపిచపూర్వా ఫల్గునీనామధేయం। సకలముదుగణానాం శస్యతే ప్రేతకార్యే॥

తా॥ అశ్విని, భరణి, ఆర్ద్ర పుష్యమి, ఆశ్లేష, పూ-ఫ, హస్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, శ్రవణము, ఈనక్షత్రములు ప్రేతకార్యములకు మంచివి. వారములలో సోమ-బుధ-గురువారములు ప్రశస్తములు॥

ప్రాచీనగ్రంథే॥ శ్లో॥ అశ్వినీభరణీచైవ మార్ద్రాపుష్యస్తథైవచ। ఆశ్లేషపుబ్బహస్తాశ్చ స్వాత్యనూరాధకౌతథా॥ జ్యేష్ఠమూలే ప్రశస్తాస్స్యుః। పూర్వాషాఢాతథైవచ। శ్రవణంప్రేతకృత్యేషు సర్వదైవప్రశస్యతే। కేచిద్వదంతిభరణీ నింద్యేతిచవిచక్షణాః॥

తా॥ ప్రాచీనగ్రంథమందు భరణీనక్షత్రము మాత్రము కొందఱు దూష్యమని చెప్పిరి.

### మృతికి దోషనక్షత్రములు.

నిర్ణయామృతే॥ శ్లో॥ రోహిణ్యాంవసుపంచకే త్రిపదభేయుగ్మాంఘ్రిభే పైతృభే నందాకామచతుర్దశీ భృగుకుజార్కేష్వేషుభద్రేతిథౌ। ప్రేతశ్రాద్ధమృతీసపిండకరణ త్రైపక్షికోనత్రయా। శ్చేద్వ్యంశకయమాప్నువంతికురుతే మాసద్విపక్షద్వయే॥

తా॥ రోహిణి-ధనిష్ట-శతతారా-పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర, రేవతి-కృత్తిక-మృగశీర్ష-పునర్వసు-ఉత్తర-చిత్త-విశాఖ-ఉత్తరాషా

ఢ-మఖ ఈనక్షత్రములయందును, ౧-౨-౬-౭-౧౧-౧౨-౧౩-౧౪ ఈతిథులయందును, శుక్ర కుజ భానువారములయందును, ప్రేతకర్మము, మరణము, సపిండీకరణము, త్రైపక్షికము, ఊనమాసికములు మొదలుగాగల ప్రేతకార్యములు చేయకూడదు చేసినయెడల ౧-౨ నెలలకు వంశమునకు కీడు కలుగునని తాత్పర్యము.

ద్విపాది త్రిపాది నక్షత్రములు.

శ్లో॥ ద్విపాదేతు త్రిమాసంస్యా త్త్రిపాదేతుచతుష్టయం। తద్విపాదం వర్జయేద్ధీమాన్ షణ్మాసంవసుపంచకే॥

తా॥ ద్విపాదినక్షత్రములగు మృగశీర్ష, చిత్త, ధనిష్ఠ ఈనక్షత్రములయందు మరణమునొందెనేని మూడుమాసములవరకును త్రిపాది నక్షత్రములగు కృత్తిక, పునర్వసు-ఉత్తర- విశాఖ- ఉత్తరాషాఢ- వీనియందు నాలుగుమాసములవరకును ధనిష్ఠ శతతారా, పూ-భా, ఉ-భా, రేవతి యీనక్షత్రములందు ఆఱు మాసములవరకును మృతగృహమును విడువవలెను.

శ్లో॥ మృతేతుదహనేచైవ ప్రేతదిష్ణ్యప్రవేశనే పుణ్యక్షేత్రేపుణ్యతీర్థౌ పుణ్యతీర్థేస్థి నిక్షేపేత్। యుగ్మాంఘ్రిభేత్రిపదభేరోహిణ్యాం పైతృభేతథా। ధనిష్ఠాపంచకేచాపి ప్రేతకార్యం నకారయేత్॥

తా॥ మృతమునందును దహనమందును నక్షత్రదోషమువలన ప్రేతయొక్క గృహము త్యాగము చేసినపిదప పునః ప్రవేశించుటయందును ప్రేతపత్నీ పుణ్యతీర్థములు సేవించుటయందును అస్థి నిక్షేపణమందును ద్విపాది త్రిపాది రోహిణీ- మఖ- యీ నక్షత్రములను ధనిష్ఠాపంచకమునందును ప్రేతకార్యముల నాచరించదగదు.

గ్రంథాంతరే శ్లో॥ నందాభద్రాకామభూతభౌమశుక్రార్కవాసరాః దహనే మరణేచైవ తద్దోషం త్రిగుణం భవేత్॥

తా॥ నందతిథులును, భద్రతిథులును, త్రయోదశి, చతుర్దశి తిథులును రవి, శుక్ర, కుజవాసరములును వీనియందు దహన మరణములు జరిగెనేని ఆమరణమునొందిన స్థలమందు పునర్మరణమును దహనముజరిగినస్థలమునందు పునర్దహనమును మూడుపర్యాయములు జరుగునని తాత్పర్యము.

శ్లో॥ తిథ్యుడు యోగే గ్రామే వారోడ్యే గేవాటికాయామ్ ।
తిథివారోడ్యే గేహే మరణం పునర్భవతి॥

తా॥ పైనవ్రాసిన దోషతిథులు నక్షత్రములు గూడగా మరణము నొందెనేని ఆ గ్రామమందు తిరుగ మరణము జరుగుననియు, నక్షత్రవారములు గూడెనేని ఆ వాటికయందు తిరుగ దహనము జరుగుననియు, తిథివారనక్షత్రములు 3 ను గూడెనేని మరణము జరిగిన ఆ గృహామునందే మరల మరణము జరుగునని తా॥ ఈప్రకారము దుష్టతిథివార నక్షత్రములయందు పరానుర్ణ మొదలగు కార్యములు గూడ జేయకూడదని పెద్దల యభిప్రాయము.

దైవజ్ఞకర్ణామృతే-శ్లో॥ భరణ్యామేకమాసంతు ద్విత్రిపాదే త్రిమాసకం॥ షణ్మాసం చకషణ్మాసం మృతౌ గేహం పరిత్యజేత్ । ద్విపాదే చత్రయోమాసాః షణ్మాసం చ త్రిపాదకే.

ధనిష్ఠాపంచక దోషకాల పరిమితి

శ్లో॥ ధనిష్ఠాయాంతు షణ్మాసం వారుణేతు త్రిమాసకం। పూర్వాభాద్రాతిదర్ధంచ అహిర్బుధ్నే తు మాసకం ।రేవత్యాం పక్షమిత్యాహుర్మృతౌ గేహవిసర్జనే। జ్యోతిర్నిబంధే॥

తా॥ ఇదివరలో ధనిష్ఠా పంచకము అయిదు నక్షత్రములకును గూడా సాధారణముగ ఆరునెలలు విడువవలసినదని జెప్పి ఇప్పుడు దానిలో భేదమును జెప్పుచున్నది, యెట్లంటే ధనిష్టకు ౬ మాసములు శతభిషమునకు 3 మాసములు, పూర్వాభాద్రకు ౨౫దినములు ఉత్తరాభాద్ర కొకమాసము. రేవతి కొకపక్షము ఈలాగున మృతియందు గృహమును విడువవలయునని తా॥ కొందరు ౫ పక్షములు మాత్రము ఆ మరణదోష గృహము విడిచివేయుట సాంప్రదాయము శిష్టాచారమని జెప్పుచున్నారు.

మృతిచక్రము.

శ్లో॥ సూర్యాధిష్ఠిత తారకాది గణయేచ్ఛత్వార బాహ్యంతరే బాహ్యే త్రీణి పునః పునశ్చ గణయే దీశాన్యదిక్షుక్రమాత్ ।

తా॥ మృతిదినంబున సూర్యుడే నక్షత్రమునందుండునో అది మొదలు ఈశాన్యదిక్కునుంచి చక్రమధ్యమువరకు ౪ నక్షత్రములును

చక్రమధ్యస్థిత నక్షత్రము మొదలు పూర్వవరకు నాలుగు నక్షత్రములును, ఆగ్నేయము మొదలు చక్రమధ్యమువరకు ౪ నక్షత్రములును. ఈప్రకారము ఆరోహణాఽవరోహణ క్రమముగా వ్రాయవలయును.



శ్లో॥ మృతికాలేందు నక్షత్రం యత్రతిష్ఠతితత్క్రమాత్। అంతరంగే త్రిపక్షంస్యాన్మధ్యకక్ష్యే ద్విపక్షకమ్। అంత్యేచ పక్షమేకం స్యాద్బాహ్యే రేఖానదోషభాక్॥

తా॥ మృతికాలనక్షత్రము చక్రమధ్యమందుంటెఅగృహం ౪౫ దినములు విడువవలయును దానికిచుట్టూవున్న ౮ గదులలో నుంటే ౧ మాసము విడువవలయును. వానికిచుట్టువున్న ప్రహరీలోపలనుంటె ౧౫ దినములు విడువవలయును. చక్రమునకు వెలుపలనుంటె ఆయింటి వారికి దోషములేదుగాని ఆయాదిక్కు లందున్న వారికి దోషము.

దైవజ్ఞకర్ణామృతమునందుమాత్రము ఈచక్రము ప్రాగాది వామ మార్గముగా చూడుమని చెప్పబడినది తత్ప్రమాణము

శ్లో॥ చతురశ్రత్రయేచక్రే ప్రాగాదిరవిభాదికే। ఆరోహ మవరోహంచ వామమార్గేణ లేఖయేత్॥

(శ్రాద్ధకాలంబున విషఘడియలు)

జ్యోతిస్సంగ్రహే శ్లో॥ స్నానేదానేజపే హోమే వైశ్వదేవే సురార్చనే॥ ప్రాయశ్చిత్తేతథాశ్రాద్ధే ప్రశస్తావిషనాడికా॥

తా॥ స్నానసమయంబున, దానసమయంబున, జపసమయంబున, హోమసమయంబున, వైశ్వదేవసమయంబున, దేవతార్చనసమయంబున, ప్రాయశ్చిత్తసమయంబున, శ్రాద్ధసమయంబున, పంచాంగస్థిత విషగడియలు దూష్యము లేదని తాత్పర్యం.

కించ॥ శ్లో॥ ఆసనే శయనే భోజ్యే మలమూత్రవిసర్జనే । ఉగ్రకర్మణ్యస్త్రవధే ప్రశస్తా విషనాడికాః॥

తా॥ ఆసన, శయన, భోజన, మలమూత్రవిసర్జన, అస్త్రప్రయోగాదులయందు కూడా ప్రశస్తములు.

## కర్మాచరణ ఫలము.

శ్లో॥ సునిర్వృత్తా క్రియా చేత్స్యాద్దాశౌచనియమైస్సహ । ప్రాప్నువంతి పితృత్వం హి ప్రియతాః కర్తృబంధవః ।

తా॥ మాతాపితృలు మృతిబొందిన సమయమువందు పుత్త్రులు ప్రేతకర్మలను చక్కఁగ నియమయుతముగ నెరవేర్చిరేని యతని మాతాపితృలు తత్కార్యానుకూలముగ విధింపఁబడిన పుణ్యలోకములను బొందుదురు. ఇంతియెగాక మాతాపితృలు పితృదేవత్వము గలవారగుదురు. అట్లగుటచే వారు ఆనందమును బొంది తమ పుత్త్రులు దీర్ఘాయుష్మంతులును, తేజోవంతులును, ధనవంతులును అగునటులు యాశీర్వచనములను జేయుదురు. ఆయాశీర్వచన సామర్థ్యంబున బుత్త్రులు సుఖవంతులై యుందురు.

శ్లో॥ పితౄణాంచ ప్రసాదేన కర్తుర్వంశోఽభివర్ధతే। శ్రేయసాంచాభివృద్ధిస్స్యాద్భూయసాముత్తరోత్తరమ్॥

తా॥ పితృదేవతలయొక్క యనుగ్రహము చేత పుత్త్రాదులయొక్క వంశ మభివృద్ధిని బొందుటయేగాక గొప్పవగు శ్రేయస్సులుగూడ విశేషించి కలుగును

శ్లో॥ పున్నామ్నో నరకాద్యస్మాత్త్రాయతే తేసుతః । తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తస్స్వయమేవ స్వయంభువా॥

శ్లో॥ జీవతో ర్వాక్యకరణాత్। ప్రత్యబ్దం భూరిభోజనాత్ । గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్త్రస్య పుత్త్రతా॥ ప్రమాణము.

## అథ కారుణ్యము.

శ్లో॥ అథాపితా తథా మాతా సాపత్నీ జననీ తథా । మాతామహస్సపత్నీకా ఆత్మపత్నీ త్వనంతరమ్ సుతభ్రాతృపితృవ్యాశ్చ మాతులాస్సహభార్యకాః। దుహితా భగినీ చైవ దౌహిత్రో భాగినేయకః । పితృష్వసా మాతృష్వసా జామాతా భావుకస్స్నుషా। శ్వశురశ్శ్యాలకశ్చైవ శ్వశ్రూశ్చ గురురర్థినః॥

తా॥ ముందు తండ్రి, తాత, ముత్తాత, పితృ వర్గత్రయము సవతితల్లి, మాతామహమాతుః పితామహమాతుః ప్రపితామహులు, మాతామహీమాతుః పితామహీమాతుః ప్రపితామహీలు, తనభార్య కుమారుడు అన్న, పినతండ్రి, పెదతండ్రి, మేనమామ వీరి భార్యలు, కుమార్తె తోడబుట్టువులు, మనమడు, మేనల్లుడు, మేనత్తలు పినతల్లి. పెదతల్లులు, అల్లుడు, తోబుట్టువుల భర్తలు, కోడలు, భార్యయొక్క తండ్రి, భార్యయొక్క సోదరుడు, భార్యయొక్క తల్లి, గురువు, యాచకులు వీరలు క్రమముగ కారుణ్యములలోని వారలని తెలియవలెను.

(ఒకనిని చిరకాలమువరకు విద్యాబుద్ధులుచెప్పించి ఆమె చనిపోయినది అప్పుడు కర్తృత్వము యెట్లని కొందరికితోచును. ఎట్లనగా పోషకపితుః అనిగాని పాలకమాతుః అనిగాని తెలియవలెను)

అక్క - జ్యేష్టభగినీ
చెల్లెలు - కనిష్టభగినీ
అన్న - జ్యేష్టభ్రాత
అన్నకూతురు - జ్యేష్టభ్రాతృపుత్రి
అన్నకొడుకు - జ్యేష్టభ్రాతృపుత్రుడు
అప్పకూతురు - జ్యేష్టభగినీపుత్రి
అప్పకొడుకు - జేష్టభగినీపుత్రుడు
అప్పమగడు - భావుకుడు
అమ్మమ్మ - మాతామహీ
అల్లు - జామాత
కూతురు - దుహిత
కొడుకుకూతురు - పౌత్రి
చెల్లెలికూతురు-కనిష్టభగినీపుత్రి
చెల్లెలికొడుకు-కనిష్టభగినీ పుత్రుడు
చెల్లెలిమగడు-భావుకుడు
పినతండ్రికొడుకు-కనిష్టపితృవ్యపుత్రుడు
పినతండ్రిభార్య-కనిష్టపితృవ్యపత్ని

పినతల్లికూతురు-కనిష్టమాతృభగినీపుత్రి
పినతల్లికొడుకు-కనిష్టమాతృ భగినీపుత్రుడు
పెదతండ్రికూతురు-జ్యేష్ట పితృవ్యపుత్రి
తండ్రి-పిత
తండ్రితండ్రి-పితామహుడు
తమ్ముడు-కనిష్టభ్రాత
తమ్మునికూతురు-కనిష్టభ్రాతృ పుత్రి
తమ్మునికొడుకు-కనిష్ట భ్రాతృపుత్రుడు
తల్లిచెల్లెలు-కనిష్టమాతృభగినీ
తల్లియప్ప-జ్యేష్టమాతృభగినీ
తల్లియప్పకూతురు - జ్యేష్టమాతృభగినీపుత్రిక
తల్లియప్పకొడుకు-జ్యేష్టమాతృభగినీపుత్రుడు
నాయనమ్మ-పితామహి

పినతండ్రి-కనిష్టపితృవ్యుడు
పినతండ్రికూతురు-కనిష్టపితృవ్య పుత్రి
పెదతండ్రికొడుకు-జ్యేష్టపితృవ్య పుత్రుడు
పెదతండ్రిభార్య-జ్యేష్టపితృవ్య పత్ని

భార్యసోదరుడు-శ్యాలకుడు
మగనితమ్మునికూతురు-భర్తృ కనిష్టభాతృపుత్రి
మనమరాలు-పుత్రికాపుత్రి
మేనత్త-పితృభగినీ
మేనత్తకూతురు-పితృభగినీపుత్రి
మేనత్తకొడుకు-పితృభగినీపుత్రుడు

కాత్యాయనః॥ శ్లో॥ సంకల్పాసనయోష్షష్టీద్వితీయాఽఽవాహనే తథా। అన్నదానేచతుర్థీస్యా చ్ఛేషాసంబుద్ధయస్స్మృతాః॥

పారస్కరః॥ శ్లో॥ అర్ఘ్యదానేచసంకల్పే పిండదానేతథాక్షయే। గోత్రసంబంధనామాని తథాతృప్తి పాదయేత్॥

## తిథిసంకల్పనిర్ణయము.

శ్లో॥ యాంతిథిం సమనుప్రాప్య ఉదయంయాతిభాస్కరః। సాతిథి స్సకలాజ్ఞేయా స్నానదానవ్రతాదిషు॥

తా॥ సూర్యుఁడు యేతిథియం దుదయించునో ఆతిథి స్నాన, దాన, వ్రత ములు మొదలుగాగల కార్యములందు సంకల్పమున చెప్పవలయును.

శ్లో॥ జన్మేచమృతకేచైవ సంగమేదం తథావనే। అభ్యంగే చోదధిస్నానే తిథిస్సాత్కాలికోభవేత్ ।

## శర్మవర్మగుప్తదాస నిర్ణయములు,

విష్ణుపురాణే॥ శ్లో॥ శర్మేతిబ్రాహ్మణస్యోక్తం వర్మేతిక్షత్రసంశ్రయం। గుప్తదాసాత్మకంనామ ప్రశస్తంవైశ్యశూద్రయోః॥

తా॥ బ్రాహ్మణులకు శర్మ, క్షత్రియులకు వర్మ, వైశ్యులకు గుప్త, శూద్రులకు దాస యిటు నామాంతరమందుండవలయును. ఇదిగాక స్త్రీలకు

శ్లో॥ దాయీదేవీచగోపీద అభిదానాన్యనుక్రమాత్। త్రయాణామపివర్ణానాం శ్రాద్ధకర్మసుపఠ్యతే॥

తా॥ బ్రాహ్మణస్త్రీలకు దాయి. క్షత్రియ స్త్రీలకు దేవి. వైశ్య స్త్రీలకు గోపీ యిట్లుగా శ్రాద్ధకర్మలయందు పఠింపవలయునని తా॥

## స్వ శా ఖా వి ష య ము.

వసిష్ఠః శ్లో॥ స్వశాఖావిధిముత్సృజ్య అన్యేషాంవిధిమాచరేత్। అప్రమాణమృషింకృత్వా అంధేతమసిమజ్జతి। స్వకంకర్మపరిత్యజ్య యదన్యత్కురుతేనరః। అజ్ఞానాదథవాలోభాత్సతేనపతితోభవేత్ । ఋక్శాఖీనైవకుర్వీత స్వకీయంపరశాఖయా। ప్రమాదాద్యదికుర్వీత పునస్సంస్కారమర్హతి। యత్రినాస్తిస్వశాఖోక్తంసమాచరేత్। పునర్నార్హతిసంస్కార మన్యథార్హతిచేత్పునః। యజుశ్శాఖావిధానేనయది బహ్వృచకస్యచః కృతేచాపిహితత్కర్తా పునఃకుర్యాద్యథావిధి । ఋక్శాఖావిధినాకర్మ యదిస్యాదన్యశాఖినామ్। నతత్కర్మ పునః కార్యమితియజ్ఞవిదాంమతమ్॥

తా॥ స్వశాఖావిధిని వదలి యితర శాఖావిధి నవలంబింపఁగూడదు. అట్లు చేసెనేని స్వకీయ ఋషిని తిరస్కరించిన వాఁడగును. ఆ కారణమువలన నంధతమస్సను నరకమునందు మగ్నుఁడగును. స్వకీయమగు కర్మను బరిత్యజించి యితరమగు కర్మను అజ్ఞానముచేతనైనను లోభముచేతనైనను చేసినయెడల పతితుఁడగును. ఏశాఖ వాఁడాశాఖను వదలివేసి మఱియొకశాఖచేత కర్మ నాచరించెనేని మరల నుపనయనసంస్కారమును జేసికొనఁదగును. స్వశాఖీయులు సంభవించనప్పుడు సకలకర్మలను ఋక్శాఖచేత నాచరింపవలయును అట్లు చేసినయెడల పునస్సంస్కారమును జేయనక్కరలేదు. యజుశ్శాఖావిధానముచేత బహ్వృచునకుఁ కర్మలను జేసినయెడల మఱల స్వశాఖోక్తవిధిగా నాచరింపవలయును. అన్యశాఖీయులకు ఋక్శాఖోక్తవిధిచేత కర్మలు చేసినయెడల మఱల జేయనక్కరలేదని వసిష్ఠుఁడు వచించెనని తాత్పర్యము.

## మరణకాల సర్వప్రాయశ్చిత్తమ్.

బ్రాహ్మణానాం మరణసంశయేస్నాపయిత్వా। కర్తాసచేలం స్నాత్వాచమ్య। పవిత్రంధృత్వా। పూర్వోక్తయేవం ... తిథౌ అముకగోత్రస్య అముకనామధేయస్య ఇహజన్మనిజన్మాభ్యా స్యాజన్మ ప్రభృత్యే తత్క్షణపర్యంతం మధ్యేవరినికాలే బాల్యయౌవన కౌమారవార్ధకేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనోవాక్కాయేంద్రియ వ్యాపారైః రహసిప్రకాశేచజ్ఞానతోఽజ్ఞానతశ్చత్వయాకృతానాం ప్రకాశకృతమహాపాతక చతుష్టయవ్యతిరిక్తానాం ప్రకాశకృతానాం మహాపాతకా ఽతిదిష్టరూపమహాపాతకనృత ఽతిదేశరూపాతిపాతకా

నాం ప్రకాశకృత మహాపాతక సమరూపాను పాతకానాం ఉపపాతకానాం సంకలీకరణానాం మలినీకరణానాం అపాత్రీకరణానాం జాతిభ్రంశకరణానాం అవకీర్ణకానాం ప్రకీర్ణకానాం రహస్యకృతానాం మహాపాతకానాం రహస్యకృత మహాపాతకాఽతిదిష్ట రూప మహాపాతకవ్రతాఽతిదేశికరూపాఽతిపాతకానాం రహస్యకృతమహాపాతక సమరూపాఽతిపాతకానాం ఉపపాతకానాం సంకలీకరణానాం మలినీకరణానాంఅపాత్రీకరణానాంజాతిభ్రంశకరణానాంఅవకీర్ణకానాం ప్రకీర్ణకానాంఏవం బహూనాంబహువిధానాంసర్వేషాంపాపానాంఅజ్ఞానసకృత్కృతానాంఅజ్ఞానతోభ్యస్తానాంజ్ఞానతసకృత్కృతానాంజ్ఞానతోభ్యస్తానాం అజ్ఞానతో జ్ఞానతశ్చాత్యంతాభ్యస్తానాంఅజ్ఞానతో జ్ఞానతశ్చనిరంతరాభ్యస్తానాం అజ్ఞానతో జ్ఞానతశ్చ చిరకాలాభ్యస్తానాం ఏవం బహూనాం బహువిధానాం సర్వేషాం పాపానామపనోదకం సర్వప్రాయశ్చిత్త పరిషదుపస్థాన పూర్వకం శక్త్యప్రత్యామ్నాయ రూపేణాచరిష్యే॥ స్వశాఖయాసంకల్పపురస్సరం మృత్తికాస్నానంకుర్యాత్। సహస్ర పరమా ... ఆపోజనయథాచనః॥

అథ పరిషద్దక్షిణాంగృహీత్వా। సమస్త ... స్వీకృత అశేషే హే పరిషన్మదీయాం విజ్ఞాపనామాకర్ణ్యమయాసమర్పితాం ఇమాం పరిషద్దక్షిణాం యథోక్తదక్షిణామివస్వీకృత్య॥ గోత్రస్య శర్మణః జన్మాభ్యాసాజ్జన్మప్రభృత్యే తత్క్షణ పర్యంతం మధ్యేవర్తి నికాలే బాల్య యౌవన కౌమారవార్ధకేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనోవాక్కాయకర్మేంద్రియ వ్యాపారైః రహసిప్రకాశేచ జ్ఞానతోఽజ్ఞానతశ్చ (మయా) (త్వయా) కృతానాం ప్రకాశకృతమహాపాతక చతుష్టయవ్యతిరిక్తానాం ప్రకాశకృతానాం మహాపాతకాఽతిదిష్ట రూప మహాపాతకవ్రతాఽతిదేశికరూపాఽతిపాతకానాం ప్రకాశకృత మహాపాతకసమరూపానుపాతకానాం, ఉపపాతకానాం, సంకలీకరణానాం మలినీకరణానాంఅపాత్రీకరణానాం, జాతిభ్రంశకరణానాం, అవకీర్ణకానాంప్రకీర్ణకానాం రహస్యకృతానాం మహాపాతకానాంరహస్యకృత మహాపాతకాఽతిదిష్టరూపమహాపాతకవ్రతాఽతిదేశికరూపాఽతిపాతకానాం రహస్యకృత మహాపాతక సమరూపాఽతిపాతకానాం ఉపపాత

కానాం సంకలీకరణానాం మలినీకరణానాం అపాత్రీకరణానాం జాతి
భ్రంశకరణాఽవకీర్ణకానాం ప్రకీర్ణకానాం ఏవం బహూనాం బహు
విధానాం సర్వేషాం పాపానాం అజ్ఞానత స్సకృత్కృతానాం అజ్ఞా
నతోఽభ్యస్తానాం జ్ఞానతస్సకృత్కృతానాం జ్ఞానతోఽభ్యస్తానాం
అజ్ఞానతో జ్ఞానతశ్చాఽత్యంతాఽభ్యస్తానాంఅజ్ఞానతోజ్ఞానతశ్చనిరం
తరాభ్యస్తానాం అజ్ఞానతోజ్ఞానతశ్చచిరకాలాభ్యస్తానాం ఏవం బహూ
నాం బహువిధానాం సర్వేషాం పాపానామపనోదకం సర్వప్రాయశ్చి
త్తం ఉపదిశేతివిజ్ఞాప్య। పునఃప్రణమేత్॥ హేయజమాన...తవజన్మా
భ్యాసాజ్జన్మప్రభృత్యేతత్క్షణపర్యంతంమధ్యేవర్తినికాలే బాల్యయౌవన
కౌమారవార్ధకేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాసు మనోవాక్కాయ
కర్మేంద్రియవ్యాపారైః రహసిప్రకాశేచ జ్ఞానతోజ్ఞానతశ్చత్వయాకృ
తేభ్యః ప్రకాశకృతమహాపాతకచతుష్టయవ్యతిరిక్తేభ్యః ప్రకాశకృత
మహాపాతకాఽతిదిష్టరూప మహాపాతక వ్రత ఽతి దేశికరూపా అతి
పాతకేభ్యః ప్రకాశకృత మహాపాతక సమరూపానుపాతకేభ్యఃఉపపా
తకేభ్యః సంకలీకరణేభ్య మలినీకరణేభ్యః అపాత్రీకరణేభ్యః, జాతి
భ్రంశకరేభ్యః ప్రకీర్ణకేభ్యః రహస్యకృతేభ్యోమహాపాతకేభ్యః రహ
స్యకృతమహాపాతకాఽతిదిష్టరూపమహాపాతకవ్రతాఽతి దేశికరూపాతి
పాతకేభ్యః రహస్యకృత మహాపాతక సమరూపానుపాతకేభ్యః ఉప
పాతకేభ్యః.. సంకలీకరణేభ్యః మలినీకరణేభ్యః. అపాత్రీ కరణేభ్య
జాతిభ్రంశకరేభ్యః అవకీర్ణకేభ్యః ప్రకీర్ణకేభ్యః అజ్ఞానతస్సకృత్కృ
తేభ్యః అజ్ఞానతోఽభ్యస్తేభ్యః జ్ఞానతస్సకృత్కృతేభ్యః జ్ఞానతోఽభ్యస్తే
భ్యః అజ్ఞానతోజ్ఞానతశ్చాఽత్యంతాభ్యస్తేభ్యః అజ్ఞానతో జ్ఞానతశ్చ
నిరంతరాభ్యస్తేభ్యః అజ్ఞానతోజ్ఞానతశ్చ చిరకాలాభ్యస్తేభ్యః బహు
భ్యః బహువిధేభ్యస్సర్వేభ్యః పాపేభ్యోవిముక్తోభూయా విముక్తోభూ
యాః॥ ఇత్యుచ్చైర్వదేత్। అథబ్రాహ్మణేభ్యో యథాశక్తి దక్షిణాం
దద్యాత్॥ ఏవం...ర్థం...జన్మాభ్యాసా జ్జన్మప్రభృతే తత్క్షణపర్యం
తం సమస్తదోషనిర్హరణార్థం స్వర్ణధాన్యాజ్య స్నానకృచ్ఛ్రాన్యా
చరిష్యే॥ బ్రాహ్మణమాహూయ ప్రతిగృహీతారంబ్రాహ్మణ మభ్యర్చ్య
శ్లో॥ స్వర్ణంపవిత్రమమలం స్వర్ణంపాపప్రణాశనమ్। స్వర్ణంహితం

కరంయస్మా దదశ్శాంతిం ప్రయచ్ఛమే। బ్రాహ్మణాయ సువర్ణదానం సద్యాత్।

శ్లో॥ ధన్యంకరోషిదాతార మిహంలోకేపరత్రచ। యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతింప్రయచ్ఛమే। ధాన్యందానందద్యాత్।

శ్లో॥ కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషుసంస్థితం। దేవానామాజ్యమాహార మతశ్శాంతిం ప్రయచ్ఛమే। ఆజ్యందానందద్యాత్।

శ్లో॥ హిరణ్యగర్భగర్భస్థం హేమబీజంవిభావసోః। అనంతపుణ్యఫలదం మతశ్శాంతిం ప్రయచ్ఛమే॥

ఇదంకృచ్ఛ్రత్రయ ప్రత్యామ్నాయం యథాశక్తిహిరణ్యంశ్రీమహావిష్ణుప్రీత్యర్థం కామయమానస్తుభ్యమహం సంప్రదదేనమ। యేవంగుణ... తిథౌగోత్రస్య... శర్మణః జన్మాభ్యాసాజ్జన్మప్రభృత్యేతత్క్షణపర్యంతంసకలపాపక్షయార్థం సర్వప్రాయశ్చిత్తగోదానంకరిష్యే। తదంగ బ్రాహ్మణపూజాంకరిష్యే। ప్రతిగృహీతారం బ్రాహ్మణమభ్యర్చ్య। మహావిష్ణుస్వరూపస్య బ్రాహ్మణస్యఇదమాసనం। సుఖాసనం। ఉభాభ్యామిదం పాద్యం।సుపాద్యం॥ నమోస్త్వనంతాయసహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయశాశ్వతే సహస్రకోటియుగధారిణేనమః... అయంవోగంధః అలంకారార్థా ఇమే అక్షతాః సకలారాధనైః స్వర్చితమస్తు।

శ్లో॥ గవామంగేషుతిష్ఠంతి భువనానిచతుర్దశ। యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతిం ప్రయచ్ఛమే। అస్మై బ్రాహ్మణాయ విష్ణుస్వరూపాయ యజుశ్శాఖాధ్యాయినే ... గోత్రాయ ... బ్రాహ్మణాయ ప్రతిగ్రహీత్రే శ్రీమాన్ ... గోత్రః ... ర్యశర్మాదాతా ధర్మపత్నీసమేతోఽహంప్రాచీనావీతీ అస్మత్పితు... గోత్రస్య... శర్మణః సర్వప్రాయశ్చిత్తగోదానం శుభమహం (సవ్యం) సంప్రదదేనమ। దేవస్యత్వా... ప్రతిగృహ్ణాతు। గోదానాభావేయథాశక్తిహిరణ్యందద్యాత్। గోదానసాద్గుణ్యార్థందక్షిణాంతుభ్యమహం... నమమ। అథదశదానాని కుర్యాత్ అథాతఃప్రైత్యమేధికమాహితాఽనాహితాగ్నేఃకస్యచిద్బ్రాహ్మణస్య ప్రాణోత్క్రమణకాలేప్రాప్తే సతిపుత్రాదిః కర్తాగోమయేనానులిప్య। కుశాదిభూమావుపరి స్తీర్య॥ తేషుదర్భేషు పితరం దక్షిణ శిరసం

నిధాయ। అథ వేదపారగం బ్రాహ్మణమాహూయ। స్నాత్వా ఆచమ్య। (ఉపవీతీ) ఓం భూః ఏవంగుణ ... తిథౌ పితుః ... గోత్రస్య ... శర్మణః జన్మాభ్యాసాజ్జన్మప్రభృత్యే తత్క్షణపర్యంతం సంభావితసకలపాపక్షయార్థం పంచానాం వాయూనాం సుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం ఉత్క్రాంతి సంజ్ఞకగోదానం కరిష్యే। శ్రీమహావిష్ణుస్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనం। ఉభాభ్యామిదం పాద్యం। శ్లో॥ నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షిశిరోరుబాహవే। సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటియుగధారిణే నమః॥ శ్రీమహా...... అయం వో గంధః అలంకారార్థా ఇమే అక్షతాః సకలారాధనైః స్వర్చితమస్తు। అథ గోపూజాం చ కుర్యాత్।

శ్లో॥ సువర్ణరోమతుల్యాని వత్సరాణి శతం దివి। ప్రాణైః కంఠగతైశ్చైవ యో గాం దద్యాత్సదక్షిణామ్॥ శ్లో॥ అత్యుత్క్రాంతౌ ప్రవృత్తస్య సుఖోత్క్రమణసిద్ధయే। తుభ్యం సంప్రదదే ధేనుమిమాముత్క్రాంతి సంజ్ఞికామ్॥ గవామంగేషు ... ప్రయచ్ఛమే॥ అస్మై బ్రాహ్మణాయ శ్రీమహావిష్ణుస్వరూపాయ యజుశ్శాఖాధ్యాయినే ... గోత్రాయ ... శర్మణే బ్రాహ్మణాయ ప్రతిగృహీత్రే శ్రీమాన్ ... గోత్రః ... నామధేయః మమధర్మపత్నీసమేతోహం ... పితుః ... గోత్రస్య ... శర్మణః సుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం ఉత్క్రాంతి సంజ్ఞిక గోదానం తుభ్యమహం సంప్రదదే న మమ॥ ఇతి జలపూర్వకం దద్యాత్।

ప్రతిగ్రహణమంత్రముచ్చార్య। దేవస్య త్వా సవితుః ప్రసవే అశ్వినోర్బాహుభ్యాం। పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి। రాజా త్వా వరుణో నయతు దేవి దక్షిణేర్రుద్రాయ గాం। తేనామృతత్వమశ్యామ్। వయో దాత్రే। మయో మహ్యమస్తు ప్రతిగ్రహీత్రే। క ఇదం కస్మా అదాత్ కామః కామాయ। కామో దాతా। కామః ప్రతిగ్రహీతా। కామగ్ం సముద్రమావిశ। కామేన త్వా ప్రతిగృహ్ణామి। కామైతత్తే। ఏషా తే కామదక్షిణా। ఉత్తానస్త్వాంగీరసః ప్రతిగృహ్ణాతు। ఇతి గృహ్ణీయాత్॥

గోదానసాద్గుణ్యార్థం దక్షిణాంతుభ్యమహంసంప్రదదేనమమ। ఇతిదక్షిణాందద్యాత్। అనేనమయాకృతే నోత్క్రాంతిసంజ్ఞక గోదానేనదక్షిణాదానేనచపితుః ... గోత్రస్య ... శర్మణః సుఖేనప్రాణోత్క్రమణసిద్ధిరస్త్వితి భవంతో బ్రువంతు। సుఖేనప్రాణోత్క్రమణసిద్ధిరస్తు।

స్త్రీణాంతు। మాతుర్గోత్రాయాః ... దాయాః జన్మాభ్యాసాజ్జన్మప్రభృతి ... ర్థం గోదానంకరిష్యే। ఇతి స్త్రీసంకల్పేవ్యూహః।

తిలపాత్రదాన ప్రయోగః.

ఆచమ్య। ఏవంగుణ ... పుణ్యతిథౌపితుర్గోత్రస్య ... శర్మణః సమస్త పాపక్షయార్థంసుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థంతిలపాత్రదానం కరిష్యే। (సవ్యం) శ్లో। తిలాఃపాపహరానిత్యం విష్ణోర్దేహసముద్భవాః। పాపంహారంతుమేతేషు ప్రమతశ్శాంతిం ప్రయచ్ఛమే। అస్మైబ్రాహ్మణాయ శ్రీమహావిష్ణు ప్రీత్యర్థం తిలపాత్రదానం దక్షిణాసహితం (ప్రే...తీ) పితుః ... గోత్రస్య ... శర్మణః సుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం తిలపాత్రదానం తుభ్యమహంసంప్రదదే (నమమ) ఏవంగుణ ... పుణ్యతిథౌపితుః ... గోత్రస్య ... శర్మణః పాపక్షయార్థం స్వర్ణధాన్యాజ్య కృచ్ఛ్రాణ్యాచరిష్యే (సవ్యం) శ్లో। స్వర్ణంపవిత్రమమలం స్వర్ణం పాపప్రణాశనం। స్వర్ణంహిశంకరంయస్మాదతశ్శాంతిం ప్రయచ్ఛమే।

శ్లో। ధన్యంకరోషిదాతార మిహలోకేపరత్రచ। యస్మాత్తస్మాచ్ఛివంమేస్యా దతశ్శాంతింప్రయచ్ఛమే॥ కామధేనోస్సముద్భూతం సర్వసర్వక్రతుషుసంస్థితం। దేవానామాజ్యమాహారం మతశ్శాంతిం ప్రయచ్ఛమే। హిరణ్యగర్భగర్భస్థం హేమబీజంవిభావసోః అనంత పుణ్య ఫలదమతశ్శాంతిం ప్రయచ్ఛమే। స్వర్ణధాన్య ఆజ్యహిరణ్య కృచ్ఛ్రత్రయ ప్రత్యామ్నాయ యథాశక్తిహిరణ్యం శ్రీమహావిష్ణు ప్రీతిం కామయమానస్తుభ్యమహం సంప్రదదే (నమమ) అథ దశదానాని। ఏవం గుణ ... పుణ్యతిథౌపితుః ... గోత్రస్య ... శర్మణః సమస్తపాపక్షయార్థం సుఖేనప్రాణోత్క్రమణసిద్ధ్యర్థం దశదానాని కరిష్యే। (సవ్యం) శ్లో। గోభూతిలహిరణ్యాజ్య వాసోధాన్యగుడానిచ రౌప్యంలవణమిత్యాహుర్దశదానాః ప్రకీర్తితాః। ఇతి దశదానాని

కుర్యాత్। తదభావే దశదానప్రత్యామ్నాయ యథాశక్తి హిరణ్యం ...నమమ।

అథకర్ణ మంత్రపఠనమ్.

ఆచమ్య... పుణ్యతిథౌ పితుః... గోత్రస్య... శర్మణః సమస్త పాపక్షయద్వారా శాశ్వత బ్రహ్మలోకావాప్త్యర్థం కర్ణమంత్ర పఠనం కరిష్యే॥

శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్। బ్రహ్మవిదాప్నోతిపరం। తదేషాభ్యుక్తా। సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ। యోవేదనిహితం గుహాయాం పరమేవ్యోమన్। సోఽశ్నుతే సర్వాన్ కామాన్త్సహ। బ్రహ్మణా విపశ్చితేతి। తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః। ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః। అగ్నేరాపః। అద్భ్యః పృథివీ। పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోఽన్నమ్। అన్నాత్పురుషః। సవా ఏష పురుషోఽన్నరసమయః। తస్యేదమేవశిరః। అయందక్షిణః పక్షః। అయముత్తరః పక్షః। అయమాత్మా। ఇదంపుచ్ఛంప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి। భృగుర్వై వారుణిః। వరుణంపితరముపససార। అధీహిభగవోబ్రహ్మేతి। తస్మాఏతత్ప్రోవాచ। అన్నంప్రాణంచక్షుశ్శ్రోత్రం మనోవాచమితి। తగ్ం హోవాచ। యతోవా ఇమానిభూతాని జాయంతే। యేనజాతానిజీవంతి। యత్ప్రయంత్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి। సతపోఽతప్యత। సతపస్తప్త్వా॥ నారాయణ నారాయణ నారాయణ॥

అథస్త్రియాశ్చ ఇతిదక్షిణకర్ణేజపిత్వా॥ ఆయుషః ప్రాణగ్ంసంతను। ప్రాణాదపానగ్ం సంతను। అపానాద్వ్యానగ్ంసంతను। వ్యానాచ్చక్షుస్సంతను। చక్షుషశ్శ్రోత్రగ్ం సంతను। శ్రోత్రాన్మనస్సంతను।

మనస్తో వాచగ్ంసంతను । వాచఆత్మానగ్ంసంతను ఆత్మనః పృథివీగ్ం సంతను। పృథివ్యాఅంతరిక్షగ్ంసంతను। అంతరిక్షాద్దివగ్ంసంతను। దివస్సువస్సంతను । ఇతిస్త్రియాః । మరణానంతర మపిఏత న్నియమేవ కర్తవ్యమ్। మరణానంతరే పుత్రాః కర్తాస్నాత్వా ఆచమ్య।

---

### షణ్ణిమిత్త ప్రాయశ్చిత్త ప్రయోగః.

ఆచమ్య ... పవిత్రంధృత్వా । ఏవంగుణ ... తిథౌ (ప్రా ... వీ) పితుః ... గోత్రస్య ... శర్మణః ప్రేతస్యసకలపాపక్షయద్వారా సంభావితానాం పాపానాం ఊర్ధ్వోచ్ఛిష్ట అధోచ్ఛిష్ట అస్నానమరణకర్ణమంత్రరాహిత్యపర్యుషిత శవఖట్వాది మరణకాలే ఉత్క్రాంతిధేను దానరాహిత్య తత్కాలదహన రాహిత్య రూపాణాం షణ్ణిమిత్తానాం పాపానామపనోదక ప్రాయశ్చిత్తంకరిష్యే। (సవ్యం) అనుజ్ఞార్థంయథాశక్తిప్రాయశ్చిత్తం కరిష్యే। పరిషద్దక్షిణాం గృహీత్వా।

శ్లో॥ సర్వ స్తసంపత్సమవాప్తి ... యథోక్తదక్షిణామివస్వీకృత్య (ప్రాచీనావీతి( పితుః ... గోత్రస్య ... శర్మణః—ప్రేతస్య మరణకాలే సంభావితేభ్యః పాపేభ్యః ఊర్ధ్వోచ్ఛిష్ట అధోచ్ఛిష్ట అస్నానమరణకర్ణ మంత్రరాహిత్యపర్యుషిత శవఖట్వాదిమరణోత్క్రాంతిధేను దానరాహిత్యతత్కాలదహన రాహిత్యరూపేభ్యస్సర్వేభ్యఃషణ్ణిమిత్తేభ్యః పాపేభ్యోవిముక్తోభూయాదితిభవంతో బ్రువంతు।పితుః ... గోత్రస్య ... ప్రేతస్యదహనాధికారయోగ్యతాసిద్ధి ... రస్తు॥(ఇతిపరిషద్బ్రూయాత్) అథకృచ్ఛ్రప్రయప్రత్యామ్నాయ గోదాన ప్రత్యామ్నాయ యథాశక్తి హిరణ్యంపితుః షణ్ణిమిత్తప్రాయశ్చిత్తసిద్ధిం కామయమానః తుభ్యమహంసంప్రదదే (నమమ) (ఉపవీతీ) (ఏవం) (త్వయా) (మయా) ఆచరితేనతి (ప్రాచీనావీతీ) పితుః పైతృమేధిక కర్మాధికారయోగ్యతా సిద్ధిరస్త్వితిభవంతో బ్రువంతు॥ పైతృమేధిక కర్మాధికార యోగ్యతాసిద్ధిరస్తు॥

## అథ తిథివార నక్షత్రాది ప్రాయశ్చిత్తమ్.

౧-౬-౧౧ నందాః } నందతిథి రిక్తతిథిమరణే
౪-౯-౧౪ రిక్తాః } ధాన్యదానం కుర్యాత్
౨-౭-౧౨ భద్రాః } భద్రతిథిమరణే భూదానంకుర్యాత్

భాను-భౌమ-భృగుశనివాసరేషు వస్త్రదానందద్యాత్
ద్విపాదిత్రిపాదినక్షత్రమరణే హిరణ్యదానంకుర్యాత్
ధనిష్ఠాపంచకమరణే కాంస్యదానంకుర్యాత్
త్రిపుష్కరమరణే గోభూతిలదానానికుర్యాత్।

---

అథ ప్రయోగః॥ ఏవంగుణ ... శుభతిథౌ (ప్రా...తీ) పితుః ... గోత్రస్య ... శర్మణః ... ప్రేతస్యమరణకాలే దుష్టతిథివారనక్షత్ర త్రిపుష్కరాది దోషపరిహారార్థం తదుక్తప్రాయశ్చిత్తంకరిష్యే। సమస్త సం... కర్తుం అధికారసంపదస్తు। తదఙ్గ బ్రాహ్మణపూజాం కరిష్యే।

ప్రతిగ్రహీతారం బ్రాహ్మణమభ్యర్చ్య। శ్రీ మహావిష్ణు... ఇదమాసనం। ఉభాభ్యామిదంపాద్యం। నమో స్త్వనంతాయ ... యుగధారిణేనమః। గంధార్థాఇమేఅపః పుష్పార్థాఇమేతిలాః। నందతిథి మరణేధాన్యం। ధన్యంకరోషి - చ్ఛమే। దద్యాత్। రిక్తతిథి మరణే ధాన్యందానం దద్యాత్। భద్రతిథిమరణే భూదానం। శ్లో॥ సర్వసస్యాశ్రయాభూమిర్వరాహేణసముద్ధృతా। అనంతసస్యఫలదాతతశ్శాంతిం ప్రయచ్ఛతు। భూదానందద్యాత్। భానుభౌమ భృగుశనివాసరేషు వస్త్రదానం। శీతవాతోష్ణ... చ్ఛమే। దద్యాత్। ద్విపాదిత్రిపాది నక్షత్రమరణే వస్త్రసహితహిరణ్యం। శీతవాతోష్ణ... చ్ఛమే। హిరణ్యగర్భ...। దద్యాత్। ధనిష్ఠాపంచకమరణే కాంస్యదానం। శ్లో॥ కాంస్యం బ్రహ్మమయం ప్రోక్తం నక్షత్రోద్భవ దోషహృత్। భాజనం మర్త్యదేవానా మతశ్శాంతిం ప్రయచ్ఛతు। దద్యాత్। త్రిపుష్కరాది మరణేగోభూతిలదానానిచ కుర్యాత్। ఏతద్ద్రవ్యాభావే యథాశక్తి హిరణ్యంవా బ్రాహ్మణాయ దద్యాత్॥

### ప్రేతౌపాసనాగ్ని సంధానప్రయోగః.

ఆచమ్య ... ఏవంగుణ ... శుభతిథౌ (ప్రాచీనావీతీ) పితుః ...

గోత్రస్య ... శర్మణః ప్రేతస్య ప్రేతోపాసనాగ్ని సంధానంకరిష్యే।
తదంగాఽగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే। (సవ్యం) యత్రాగ్నిస్థాప్యతే...
భూర్భువస్సువరోమిత్యగ్నిం ప్రతిష్ఠాప్య। ఓంభూర్భువస్సువరోమ్।
అథ ప్రేతస్యదక్షిణహస్తే సమిధమారోప్యహస్తమన్వారభ్య। ఓమ్
ఉపావరోహ జాతవేద ఇమంతగ్గ్ స్వర్గాయలోకాయనయ ప్రజాగ్ం।
ఆయుఃప్రజాగ్ం రయిమస్మాసుధేహి ప్రేతాహుతిశ్చాస్యజుషస్వస్వా
హా॥ తాంసమిధం అగ్నౌనిక్షిప్య। చత్వారిశృంగాత్రయో అస్యపాదా
ద్వే శీర్షేసప్తహస్తాసో అస్య। త్రిధాబద్ధో వృషభోరోరవీతిమహో దేవో
మర్త్యాగ్ం అవివేశ। (యజ్ఞేశ్వరంధ్యాయామి) సప్తహస్తశ్చతుశ్శృం
గస్సప్తజిహ్వోద్విశీర్షకః। త్రిపాత్ప్రసన్న వదనస్సుఖాసీనశ్శుచిస్మితః।
స్వాహాంతుదక్షిణేపార్శ్వే దేవీం వామేస్వధాంతథా। బిభ్రద్దక్షిణహస్తై
స్తు శక్తిమన్నంస్రుచం స్రువమ్। తోమరంవ్యజనం వామైర్ఘృత
పాత్రంతుధారయన్। మేషారూఢంజటాబద్ధం గౌరవర్ణం మహౌజసమ్
ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చిస్సర్వకామదమ్। ఆత్మాభిముఖ
మాసీన మేవంధ్యాయేద్ధుతాశనమ్। ఏషహిదేవః। ప్రదిశోనుసర్వాః
పూర్వోహిజాతస్సఉగర్భేఅంతః। సవిజాయమాన స్సజనిష్యమాణః
ప్రత్యఙ్ముఖాస్తిష్ఠతివిశ్వతోముఖః॥ఏహ్యగ్నేమమాభిముఖోభవసుము
ఖోభవసుప్రసన్నోభవ।వరదోభవ।ఓంభూర్భువ... ప్రచోదయాత్ అ
గ్నింపరిసమూహ్య। అలంకృత్య। అగ్నయేనమః। హుతవహాయనమః।
హుతాశినేనమః। కృష్ణవర్త్మనేనమః। దేవముఖాయనమః। సప్త
జిహ్వాయనమః। వైశ్వానరాయనమః। జాతవేదసేనమః। ప్రాగాది
దర్భైరగ్నిం పరిస్తృణాతి। పురస్తాత్। దక్షిణతః। పశ్చాత్। ఉత్తర
తః। ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాన్సంస్తీర్య। ద్వంద్వంన్యంచి
పాత్రాణిప్రయునక్తి। దర్వ్యాజ్యస్థాల్యాప్రోక్షణస్రువౌ। సమానా
గ్రౌద్వౌదర్భౌప్రాదేశ మాత్రౌపవిత్రేకరోతి। అద్భిరనుమృజ్య

ప్రోక్షణపాత్రేనిధాయ। ప్రోక్ష్య। తస్యాముపఆనీయ। హస్తయోరం
గుష్ఠోపకనిష్ఠికాభ్యా ముదగగ్రే గృహీత్వా। ప్రాచీస్త్రిరుత్పూయ।
సపవిత్రేణ పాణినాపాత్రాణి సంస్పృశ్య। పాత్రాణ్యుత్తానానికృత్వా।
త్రిఃప్రోక్ష్య। ఆజ్యస్థాలీమాదాయ। ఆజ్యంవిలాప్య। అపరేణాగ్నిం పవి
త్రాంతర్హితా యామాజ్యస్థాల్యామాజ్యంనిరూప్య। ఉదీచోంగా
రాన్నిరూహ్య। తేష్వధిశ్రిత్య జ్వలతాతృణేనాఽధోగామిన్యాదీప్యఽ
జ్యై ప్రతిఫలీకృత్య। ద్వేదర్భాగ్రే ప్రచ్ఛిద్యప్రత్యూశ్య। ప్రచ్యస్య అప
ఉపస్పృశ్య! త్రిఃపర్యగ్నికృత్వా। ఉదగుద్వాస్య। అంగారాన్ప్రత్యూ
హ్య। ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరాహారమాజ్యం త్రిరుత్పూ
య। పవిత్రగ్రంథింవిస్రస్య। ప్రత్యూశ్య। ప్రాగగ్రమగ్నౌ పవిత్రేఽను।
ప్రహరతి। స్రుక్స్రువావగ్నౌప్రతితప్య దర్భాగ్రైస్సంమృజ్య।
పునఃప్రతితప్య। ప్రోక్ష్య। నిధాయ। దర్భానద్భిస్సగ్గ్‌స్పృశ్యాగ్నౌ
ప్రహరతి॥ అదితేనుమన్యస్వ। అనుమతేనుమన్యస్వ। సరస్వతేను మన్య
స్వ। దేవసవితః ప్రసువ॥ ఓంఓం॥ సంకల్పప్రభృతి ఏతత్క్షణపర్యంతం
మధ్యే సంభావిత సమస్తదోషనిర్హరణార్థం సర్వప్రాయశ్చిత్తంకరిష్యే
ఓం భూర్భువస్సువస్స్వాహా॥ ప్రజాపతయ ఇదంనమమ॥ స్రువేణాజ్య
మాదాయ॥ అయాశ్చాగ్నేస్య నభిశస్తీశ్చ సత్యమిత్వమయా అసి ।
అయసామనసాధృతోయసాహవ్యమూహిషేయానోధేహిభేషజగ్గ్ స్వాహా
అయసేఅగ్నయఇదంనమమ।సర్వప్రాయశ్చిత్తంకరిష్యే! ఓంభూర్భువ
స్సువస్స్వాహా॥ప్రజాపతయ ఇదంనమమఅదితేన్వమగ్గ్‌స్థాః దేవసవితః
ప్రాసావీః ఓంఓం ... ఏవంగుణ ... పుణ్యతిథౌ ... (పా ... తీ)పితుః ... గో
త్రస్య .. శర్మణః ప్రేతస్యబహూనామనేకదినేషుపాకయజ్ఞ వ్రతలోప
ప్రాయశ్చిత్తార్థం సప్తహోతారంహోష్యామి। (సవ్యం( తూష్ణీంసమం
తం పరిషిచ్య॥ ఏకం-ద్వే-త్రీణిచత్వారి॥ మహోహవిర్హోతా సత్యహవి
రధ్వర్యుః॥ అచ్యుతపాజాఅగ్నీత్। అచ్యుతమనాఉపవక్తా. అనాధృ
ష్యశ్చాప్రతిధృష్యశ్చయజ్ఞస్యాభిగరౌ। అయాస్యఉద్గాయా। వాచ

స్పతేహృద్విదేనామ॥ విధేమతేనామ। విధే స్తమసృక్తంనామ।వాచ స్పతిస్సోమమపాత్। మాదైవ్య స్తంతుచ్ఛేదిమామనుష్యః నమోద్రి వేనమః పృథివైస్వాహా। వాచస్పతయే బ్రహ్మణ ఇదంనమమ। సర్వ ప్రాయశ్చిత్తంకరిష్యే॥ ఓంభూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదంనమమ। తూష్ణీముత్తర పరిషేచనంకృత్వా॥

అథా ఔపాసనమ్.

ప్రాణానాయమ్య॥ ఏవం...ప్రీత్యర్థం (ప్రా...తీ) పితుః ... గోత్రస్య...శర్మణః ప్రేతస్యసాయం ప్రాతరౌపాసనం తండులైర్హో ష్యామి॥ (సవ్యం) చత్వారి శృంగాత్రయో అస్యపాదా ...అద్రితేను మస్యస్వ... ప్రసువ॥ఓంఓం... తిథౌ...(ప్రా...తీ) పితుః ... గోత్రస్య ...శర్మణః ప్రేతస్య అనేకకాలఔపాసనాంతరిత ప్రాయశ్చిత్తార్థం సద్యస్కాలే ఔపాసనాధికార సిద్ధ్యర్థం హోమద్రవ్య దానంకరిష్యే॥ (సవ్యం) శ్లో॥ తండులైర్వైశ్వదైవత్యాః పాకేనాన్నంపచంతియే॥ తస్మాత్తండుల దానేనాతశ్శాంతింప్రయచ్ఛమే॥ హిరణ్యగర్భగ... మే॥ సంప్రదదేనమమ॥ యథాశక్తిదక్షిణాందద్యాత్॥ ఓంసూర్యాయ స్వాహా- సూర్యాయేదంనమమ॥ అగ్నయేస్వాహా అగ్నయ ఇదం నమమ॥ అగ్నయేస్విష్టకృతేస్వాహా॥ అగ్నయేస్విష్టకృత ఇదంనమమ తూష్ణీంపరిషిచ్య॥ అగ్నేత్వన్నో అంతమః ... అఘాయతస్సమస్మాత్॥ హోమసాద్గుణ్యార్థం అనాజ్ఞాతత్రయమంత్ర జపంకరిష్యే॥ అనాజ్ఞాతం ...అనేన... హోమేన భగ...ఏతత్ఫలం శ్రీ యజ్ఞేశ్వరార్పణమస్తు॥

అథ పైతృమేధిక కర్మారంభః.

ఆచమ్య॥ పవిత్రంధృత్వా॥ ఏవంగుణ... తిథౌ (ప్రాచీనావీతీ) యజమానస్య పితరం... గోత్రం... శర్మాణంప్రేతం ఔపాసనాగ్నినా పైతృమేధికేన కర్మణాసగ్స్కరిష్యే॥ (సవ్యం) స్త్రియాః-స్త్రీకి నీలా గున సంకల్పము జేయవలయును... యజమానస్యమాతరం... గోత్రాం

... దాయింప్రేతౌపాసనాగ్నినా పైతృమేధికేన కర్మణాసగ్గ్ స్కరిష్యే ఇతిబ్రూయాః। (ప్రాచీనావీతీ) ఔపాసనాగ్నేః పశ్చాద్దక్షిణాగ్రైర్ దర్భైంతత్సగ్గ్ స్తీర్య। తేషుతిలానవకీర్య। తేషుదర్భేషుసర్వస్య ప్రతిశీవరీతి మంత్రేణప్రేతం దక్షిణశిరసగ్ంసంవేశయంతి। సర్వత్రప్రాచీనావీత్యేవ।

పురుషాణామ్ { సర్వస్యప్రతిశీవరీభూమిస్త్వోపస్థఆధిత।స్యోనాస్మై సుషదాభవయచ్ఛాస్మై శర్మసప్రథాః॥

స్త్రీణామ్ { సర్వస్యప్రతిశీవరీ భూమిస్త్వోపస్థఆధిత।స్యోనాస్యై సుషదాభవయచ్ఛాస్యై శర్మసప్రథాః॥

ఏవంగుణ ... తిథౌపితుః ... గోత్ర ... శర్మణః ప్రేతస్య మరణదినాదారభ్య ప్రథమేహనికర్తవ్య ఔపాసనాగ్నౌపైతృమేధికహోమం కరిష్యే। (అపసవ్యం)ఓంచత్వారిశృంగాత్రయోఅస్యపాదా ... జాతవేదసేనమః॥ (ఇచ్చట తిలలే ప్రధానము) ఔపాసనాగ్నేర్దక్షిణతః అప్రదక్షిణం దర్భైఃపరిస్తీర్య। ప్రేతకార్యే ఏకేనదర్భేణ కార్యమితి భారద్వాజః)

అగ్నేర్దక్షిణతః దర్భాన్సగ్ స్తీర్య। దర్వీమాజ్యస్థాలీం ప్రోక్షణీమితరదర్వీంనిధాయ। ఏకేనదర్భేణ పవిత్రంకృత్వా। తృణంకాష్ఠం వాంతర్ధాయాఛినత్తి। ననఖేన। అపఉపస్పృశ్య। అద్భిరనుమృజ్య॥ ప్రోక్షణ్యామవధాయ। ప్రోక్ష్య। తస్యామపఆనీయ। హస్తయోరంగుష్ఠోపకనిష్ఠికాభ్యాం దక్షిణాగ్రగంహీత్వా। ప్రాచీస్త్రిరుత్పూయ। సపవిత్రేణ పాణినాపాత్రాణిసంస్పృశ్య। పాత్రాణ్యుత్తానానికృత్వా త్రిఃప్రోక్ష్య। శేషముత్సిచ్య। ఆజ్యస్థాలీమాదాయ। ఆజ్యంవిలాప్య। దక్షిణేనాగ్నిం పవిత్రాంతర్హితాయామాజ్యస్థాల్యామాజ్యంనిరూప్య దక్షిణతోఽంగారం నిరూహ్య। తస్మిన్నధిశ్రిత్య జ్వలతాదర్భేణావద్యుత్య। ఏకదర్భాగ్రంప్రచ్ఛిద్య। ప్రక్షాళ్య। ఆజ్యేప్రత్యస్య। అప ఉపస్పృశ్య అ త్రిఃపర్యగ్నికృత్వా। దక్షిణతఉద్వాస్య। అంగారం

ప్రతాప్య। దక్షిణాగ్రేణపవిత్రేణ పునరాహారమాజ్యం త్రిరుత్పూయ। పవిత్రగ్రంథింవిస్రస్య। ప్రక్షాళ్య। దక్షిణాగ్రముగా ప్రహరతి। స్రుక్స్రువావాదాయ। అగ్నౌప్రతితప్య। దర్భైణసంమృజ్య। పునః ప్రతితప్య। ప్రోక్ష్య। నిధాయ। దర్భమద్భిస్సగ్గ్స్పృశ్య ప్రత్యగగ్రమగ్నౌప్రహరతి తూష్ణీమప్రదక్షిణం పరిషిచ్య।

తతఃకర్తావామహస్తేన ప్రేతమన్వారభ్య (కర్త) తన యెడమ చేతితోఁ బ్రేతనుబట్టుకొని ద్వాదశగృహీతేనాజ్యేన స్రుచంపూరయిత్వా। ఓం సంత్వాసించామియజుషాప్రజామాయుర్ధనంచ। ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః। శ్రీగురుభ్యోనమః హరిః ఓమ్। మంత్రః పరేయువాగ్ంసం ప్రవతోమహీరనుబహుభ్యః పంథామనుపస్పశానం। వైవస్వతగ్ం సంగమనంజనానాంయమగ్ంరాజానగ్ం హవిషాదువస్యతస్వాహా॥ వైవస్వతాయ యమాయరాజ్ఞ ఇదం (నమమ) ఇత్యుక్త్వా। ఇతిస్రువాహుతింజుహోతి॥ తూష్ణీమ ప్రదక్షిణంపరిషిచ్య।

దక్షిణేనౌపాసనాగ్నిం పరిశ్రితే దేశే-(ఔపాసనాగ్నికి దక్షిణపు తట్టు మరుగుకట్టిన ప్రదేశమందు.)

ప్రేతస్య కేశశ్మశ్రులోమనఖాని వాపయిత్వా - దేశాచారేణ గ్రాహ్యం।

ప్రేతకు తల వెంట్రుకలు గడ్డము మొదలైనవానిని వపనము చేయించవలయును. ఈ ఆచారము చేయుటలేదు.

స్నాపయిత్వా! భస్మాదిభిరలంకృత్య శుక్లసూత్రేణ హస్తయోః పాదయోశ్చాంగుష్ఠౌబధ్వా।

ప్రేతను స్నానము చేయించి విభూతి మొదలగువానిచేత నలంకరించి, తెల్లని దారము చేత ప్రేత కాళ్ళ బొటనవ్రేళ్ళను చేతుల బొటనవ్రేళ్ళను గట్టవలయును.

శిరసినలదమాలామాబధ్య॥ ఔదుంబర్యామాసందీం కృష్ణాజినం దక్షిణాగ్రీవమధరలోమాసమాస్తీర్య।

ప్రేత తలను కట్టి వ్రేళ్ళతో కట్టి అత్తికొమ్మలతో బాడెనగట్టి దానిమీద [illegible] గాని వెంట్రుకలు తలకట్టు క్రిందికి నుండునట్లు బరచి,

తస్మిన్ ప్రేతముత్తానం నిపాత్య।
ఆ పాడెమీద ప్రేతను వెల్లికల బరుండబెట్టి,

ఇదంత్వా వస్త్రమితి మన్త్రేణ ప్రేతస్య పాదాదిశిరః పర్యంతం పరిచ్ఛాద్య।

ఇదంతాత్త్వావస్త్రం ప్రథమన్వాగన్న పైతదూహాయ దిహాభిభః పురా। ఇష్టాపూర్తమనుసంపశ్య దక్షిణాం యథాతేదత్తంబహుధావిభన్ధుషు।తతః నారాయణ స్మరణం కార్యమ్।

తతః కర్త్రాదీనూ వస్త్రాణి వాసశ్ఛధృత్వాచమ్య।

(ఉ.వీతీ) ఆచమ్య ... శ్రీకృష్ణాయనమః॥ (ప్రాచీనావీతీ) ప్రేతోపాసనాగ్నౌ ఉపచరితం చరుగ్ం శ్రపయిత్వాఽభిఘార్య। తతః వాహకాన్ వృణుయాత్ (వాహకులకువరణమీయవలయును) తేషాంనూతన వస్త్రాణిదద్యాత్। తేనివీతినోభూత్వా (వాహకులు యజ్ఞోపవీతమును దండగా వేసికొని) సంభారానాదాయాఽగ్ని ప్రథమంగచ్ఛంతి।

సంభారవస్తువులను అగ్నినిదీసికొని (కర్త) ముందుగాపోవలెను.

తీసికొనిపోవలసిన వస్తువులు

అగ్నిని, చరువును, మేకను, బంగారు తునకలును, గోవును, దర్భలను, నేతి పాత్రను, ప్రోక్షణీపాత్రను, కొయ్యమేకును, ఇతరదర్విని, ఉదకమును, సువ్వలను, బియ్యమును, మూడు పలాశకొమ్మలను, లేక జమ్మికొమ్మలను, త్రాటిని, ప్రేతతోఁగూడ తీసికొని పోవలయును.

పూషాత్వేతశ్చ్యావయతు ప్రవిద్వానసష్టపశుర్భువనస్యగోపాః। సత్వైతేభ్యః పరిదదాత్పితృభ్యోఽగ్నిర్దేవేభ్యస్సువిదత్రేభ్యః॥

వాహకులు ఈమంత్రముతో ప్రేతను మోసికొనిపోవలయును.

ప్రేతను బండిమీదఁ తీసికొనిపోవు పక్షమందు,

ఇమౌయునజ్మితెవహ్నీ అసునీథాయవోఢవే యాభ్యాంయమస్య సాదనగ్ం సుకృతాం చాపిగచ్ఛతాత్।

శ్మశానమార్గస్య చతుర్థాంశంగత్వా। త్రిఃప్రోక్ష్య। దక్షిణాగ్రాన్ దర్భాన్సగ్ంస్తీర్య తిలాన్వికీర్య।

తత్రసర్వస్య ప్రతిశీవరీతి మంత్రేణ ప్రేతం దక్షిణశిరసం నిధాయ।

### పురుషప్రేత నిధానమ్.

సర్వస్యపప్రతిశీవరీభూమి స్త్వోపస్థఆధితశ్శోనాస్మైసుషదా భవ యచ్ఛాస్మైశర్మసప్రథాః॥

### స్త్రీప్రేత నిధానమ్.

సర్వస్యప్రతిశీవరీ భూమిస్త్వోపస్థఆధిత। స్యోనాస్యైసుషదాభవ యచ్ఛాస్యైశర్మసప్రథాః॥

తత్రప్రేతస్య చతుర్దిక్షుకాశపాదవదుల్లిఖ్య। తేషుదర్భానాస్తీర్య। దర్భేషుపర్యేత త్రిలోదకాన్యుపతిష్ఠంతు। ౪।

పథివాపిభ్యోభూతేభ్యః ఇమంబలిందదామి।

ఏత త్రిలోదకాన్యుపతిష్ఠంతు। యథాశక్తి దక్షిణాం దత్వా। (పుత్రాదయః) ఏకవాససోదక్షిణాన్కేశానుద్గ్రథ్య (సవ్యాన్విస్రస్య।)

పుత్రులు మొదలగువారు ఏకవస్త్రములుగలవారలై కర్త యొక్క జుట్టు రెండుభాగములుచేసి కుడివైపుభాగం ముందు ముడి వేసి యెడమవైపు వెంట్రుకలు విడదీయవలెను.

అపనశ్శో... దఘమ్। ఇతిత్రిః ప్రదక్షిణాని కుర్యాత్। కనిష్ఠ పూర్వాస్త్రీ పురస్సరాఃత్రిః ప్రదక్షిణాని కుర్యాత్।

అపనశ్శోశుశుచదఘమగ్నే శుశుద్ధ్యారయిమ్। అపనశ్శోశుచదఘమ్। (కర్త) కుడితొడలఁగొట్టుకొనుచు 3 మాఱులు ప్రేతకు అగ్నికి నప్రదక్షిణముగాఁ దిరుగవలయును.

తతస్సవ్యానుద్గ్రథ్య। దక్షిణాన్కేశాన్విస్రస్య।
(జుట్టుయెడమవైపు కేశములనుముడివేసి కుడివైపు కేశములనువిడఁదీసి)

అపనశ్శో... దఘం। ఇతితిర్యః ప్రదక్షిణాని కుర్యాత్।
పూషేమాఆశాఇతిమంత్రేణ ప్రేతమానీయ। పూషేమా

ఆశ్రా అనువేద్దసర్వాస్స్యరస్మాగ్ం అభయతమేననేవత్। స్వస్తిదా అఘృణి స్సర్వవీరోఽప్రయుచ్ఛన్పురఏతు ప్రవిద్వాన్। ద్వితీయమధ్య నోగత్వా। దాత్రేణభూమౌశాక పాదవదుల్లిఖ్య। ఉదకంసంప్రోక్ష్య పూర్వోక్తప్రకారేణ సర్వంకుర్యాత్। ఆయుర్విశ్వాయురితిమంత్రేణ ప్రేతమనుమంత్రయేత్॥

ఆయుర్విశ్వాయుః పరిపాసతిత్వాపూషాత్వాపాతు ప్రపథేపుర స్తాత్। యత్రాసతే సుకృతో యత్రతేయయు స్తత్రత్వాదేవస్సవితా దధాతు॥ తృతీయమధ్వనోగత్వా। పూర్వోక్తప్రకారేణ ప్రదక్షిణాది సర్వం కుర్యాత్॥ తృతీయపర్యాయాంతే చరుస్థాలీంభింద్యాత్। (పునః ప్రేతంతూష్ణీమాదదతే।) (మంత్రము చెప్పకుండా ప్రేతన త్తికొని

అథ దహనప్రయోగం.

తతః దహనదేశంగత్వా। త్రిఃప్రోక్ష్య। తత్రప్రేతం దక్షి శిరసంనిధాయ। ఏషావై దేవమనుష్యాణాగ్ం శాంతాదిక్। తావై పైనానసూత్రాక్రమంతి। (ఇతిజపిత్వా) ఉత్క్రామంత్యదీచోగచ్ఛం తి (అందరు ఉత్తరపుతట్టుకు వెళ్ళవలయును) ప్రత్యేత్య-తిరిగివచ్చి పలాశశాఖయా (అభావేశమీశాఖయావా) అపేతవీతేతిసగ్ం హిం మన్త్రేణ దహనదేశం సంమృజ్య।

అపేతవీత విచసర్పతాతో యే త్రస్థపురాణాయేచనూతనాః అదాద్విదంయమోవసానం పృథివ్యా అక్రన్నిమంపితరో లోకమస్మై

అపఉపస్పృశ్య। తత్రహిరణ్యశకలాన్నిక్షిప్య। దక్షిణాగ్రా దర్భానాస్తీర్య। పలాశాదిభిః। యథాసంభవకాష్ఠైః దారుచితంకృత్వా చితేః పురస్తాదౌపాసనాగ్నింనిధాయ। దక్షిణాభిముఖస్సన్। ఆచమ్య.. ఏవంగుణ... తిథౌ యజమానస్యపితుః... గోత్రస్య... శర్మణః ప్రేతస అంతరాగమనతద్దోష పరిహారార్థం పథికృదిష్టిప్రాయశ్చిత్తంకరిష్యే ... పరిషద్భ్రూయాత్। కాలేఅధికారసిద్ధిరస్తు॥ అథకృచ్ఛ్రత్రయ

సుమంతుః॥ శ్లో॥ భర్తన్మాతకపాస్థి చయనాత్పూర్వమేవవా। తద్భార్యాతు మృతాపూజ్యా సావైసౌవాసినీభవేత్॥

అత్రసిద్ధాంతపక్షః॥ శ్లో॥ అస్థిసంచయనాత్పూర్వం ప్రేతపత్నీమృతింగతా। సువాసినీతివిఖ్యాతా పరంవైధవ్యమాప్నుయాత్॥ భర్తృసంచ యనాత్పూర్వం భార్యాయదివిపద్యతే। సువాసినీత్వంతస్యాస్తి అన్యథావిధవాభవేత్॥ ఇతి సువాసినీత్వ మృతినిర్ణయస్సమాప్తః.

## అథ కర్తృనిరూపణమ్.

శ్లో॥ పుత్రఃపౌత్రఃప్రపౌత్రశ్చ పుత్రికాపుత్రఏవచ। పత్నీభ్రాతా చతత్పుత్రః పితామాతాస్నుషాతథా। భగినీభాగినేయశ్చ పిండదోధన హార్యపి పూర్వాభావేపరఃకర్తా తదభావేపరఃపరః॥

తా॥ పుత్రుఁడు, పౌత్రుఁడు, ప్రపౌత్రుఁడు, పుత్రికా పుత్రుఁడు భార్య, అన్న, అతని పుత్రుఁడును, తండ్రియు, తల్లియు, కోడలును, చెల్లెలును, మేనల్లుఁడును, సపిండుఁడును, ధనహర్తయు, వీరు పూర్వ పూర్వాభావమునం దుత్తరోత్తర కర్తృత్వముగలవారని తా॥

## స్త్రీకర్తృత్వమ్.

మరీచిః॥ శ్లో॥ స్త్రీకర్తృకతన్త్రకృత్యేషు పిత్రోఃకర్మణిచేద్యది। దశాహాభ్యంతరేదైవా ద్రజోదోషేణదూషితా॥ తత్కర్మవ్యర్థతామేతి స్నాత్వా పంచమేహని। నగ్నశ్రాద్ధంసమారభ్యపునఃకర్మసమారభేత్

తా॥ భర్తయొక్క ప్రేతకృత్యంబులయందు భార్యయే కర్తయైయుండి పదిదినములలోపల రజోదూషితురాలయ్యేనేని నదివరకుకర్మ యంతయును వ్యర్థమగును. కావున పంచమదినంబునందు స్నానంబుచేసి నగ్నశ్రాద్ధంబును ప్రారంభించి మరల కర్మను చేయవలయునని మరీచి వచించెను.

కేచిత్॥ శ్లో॥ పుత్రాభావేతుపత్నీస్యా త్పత్న్యభావేతుసోదరః। పత్న్యభావేతుసాపత్న్యః పుత్రఏవనియుజ్యతే॥తదభావేతు తత్పుత్రో రాసన్నోన్యస్తతః పరమ్॥ ఆద్యశ్రాద్ధమపుత్రోపి కుర్యాదేకాదశేహని॥

తా॥ ఔరసపుత్రుఁడు లేనప్పుడు క్షేత్రజ్ఞులును, పుత్రికయును, పుత్రికాపుత్రుఁడును, సోదరుఁడును, తత్పుత్రుఁడును, సపిండీకరణమును చేయవలయును, వీరు లేనప్పుడు భార్యయు, ధనహర్తయును చేయవచ్చును, కొంతమంది పుత్రాభావమందు పత్నియనిరి. పత్న్యభావమందు సోదరుఁడును, అట్లుగాక భార్యాభావమందు సవతితల్లియు, ఆమె లేనప్పుడు ఆమెపుత్రుఁడును, వీరు లేనప్పుడు వీరి పుత్రుఁడును పిమ్మట దగ్గరసంబంధులును కర్తృత్వముగలవారని తా॥ ఆద్యశ్రాద్ధము ౧౧ వ దినమునందు చేయవలెను, యిందువలన కర్తకు శుద్ధిగలదని తా॥

శ్లో॥ ఏకాదశేహ్ని సంప్రాప్తే కర్తృభార్యారజస్వలా। ఆద్యశ్రాద్ధం ప్రకుర్వీత ఊనాద్యానివిసర్జయేత్॥ శ్రాద్ధకర్తుర్యదాభార్యా ఆశౌచాంతే రజస్వలా। శ్రాద్ధం శేషం ప్రకుర్వీత వర్జయిత్వాసపిండనమితి॥ శ్రాద్ధశేషం ప్రకుర్వీతేత్యనేన వాక్యేనఏకాదశేహని విహితమాద్యమాసికం రుద్రగణాఖ్యశ్రాద్ధం వృషోత్సర్జనాంగశ్రాద్ధంచకుర్యాత్। వర్జయిత్వా సపిండనమితి తదర్థమపకృష్య పంచదశైకోద్దిష్టశ్రాద్ధాని వర్జయేత్। కేచిత్ పంచమదినే శుద్ధింసంపాద్య ఆద్యాది షోడశైకోద్దిష్టశ్రాద్ధసపిండీకరణ శ్రాద్ధమాచరంతి॥

తా॥ పదునొకండవ దినము సంప్రాప్తమగుచుండగా కర్తయొక్క భార్యా రజస్వల యయ్యెనేని ఆద్యశ్రాద్ధంబును చేయవలయును. ఊనాద్యాదులను వదలవలయును, శ్రాద్ధంకర్తయొక్క భార్య ఆశౌచాంతమునందు రజస్వలయయ్యెనేని సపిండనమును వదలి శ్రాద్ధశేషమును చేయవలయును అనఁగా ౧౧ వ దినమునందు శాస్త్రోక్తప్రకారముగ చేయదగిన పుణ్యాహవాచనము ఆహ్నికము రుద్రగణాఖ్యశ్రాద్ధము వృషోత్సర్జనాంగ శ్రాద్ధమును చేయవలయును షోడశశ్రాద్ధములలో ఆద్యశ్రాద్ధమునుదప్ప పంచదశైకోద్దిష్టశ్రాద్ధములుమాత్రము వదలవలయును. కొందరు ఈ ఆద్యశ్రాద్ధముకూడా భార్య రజస్వలయయిన ౫ వ దినంబున స్నానము ఆయిన పిమ్మట ఆద్యాదిషోడశ ఏకోద్దిష్టశ్రాద్ధము సపిండీకరణ శ్రాద్ధము నొకదినమునందే ఆచరింపుచున్నారు తక్కినవిషయములు దేశాచారములనుబట్టి జరుపవలయును.

ఇతి కర్తృభార్యా రజస్వలా విషయ స్సమాప్తః.

త్రైపక్షికాది శ్రాద్ధకాల నిర్ణయః.

తిథిదర్పణే శ్లో॥ కుర్యాత్త్రైపక్షికంశ్రాద్ధం త్రిపక్షేవిషమేహని అపర

త్రిపక్షే ద్వాదశే పక్షే చతుర్వింశతిపక్షకే। షష్ఠంత్రింశంచకం కృత్వా ఆది మధ్యాంతపంచకే॥

తా॥ త్రైపక్షికశ్రాద్ధము మూడవపక్షములో విషమదినమందు చేయవలయునని తిథిదర్పణమను గ్రంథమునందుఁ జెప్పఁబడియె, మూడవపక్షంబున నాదియందు ౫వ దినములలో నొకదినంబున త్రైపక్షిక శ్రాద్ధము చేయవలెను. అనఁగా మృతదినమునకు 30 రోజుల పిమ్మట ౫ రోజుల లోగాను ఆరవ మాసమున యిరువది దినములు మొదలు అయిదు దినములకు లోపుగా శుద్ధిగల యొకదినంబున ఊనషాణ్మాసికంబును పన్నెండవ మాసంబున యిరువదియయిదు దినములకుపైన నొక శుద్ధిగలదినమునందు ఊనాబ్దిక శ్రాద్ధంబును చేయవలయునని తా॥ కొందరు త్రైపక్షికము ౪౦ దినములకు పిమ్మట ౪౫ రోజులలోగా జరిపించుచున్నారు.

స్మృత్యంతరే॥ శ్లో॥ గణశః క్రియమాణేషు మాసికేష్వాబ్దికేషు। త్రిభిస్స్వర్ఘ్యం ద్విషాత్రాణి పిండాన్ త్రీన్నేవ నిర్వపేత్।

తా॥ అనేకములగు మాసికముల నొక్కతూరి చేయునెడల అర్ఘ్యపాత్రి పిండము మూడేసియే యుంచవలెను.

వ్యాసః॥ శ్లో॥ సపిండీకృతే ప్రేతే పితృత్వముపపద్యతే। అకృతస్య తు పుత్రస్య శుభం నాన్యమిష్యతే। న చ నైమిత్తికం కామ్యం మిష్టాపూర్తాదికం చన। నాసపిండీకృతేపి నోత్ర రస్యేహ శ్రాద్ధమేవచ।

తా॥ సపిండీకరణము చేయనియెడల ప్రేతత్వము విడిచిపోదు. చేయని పుత్రునకు శుభము కొంచమైనను లేదు. తల్లిదండ్రులకు సపిండీకరణము చేయక మునుపు ఇతరులకు శ్రాద్ధము చేయఁగూడదని వ్యాసుఁడు వచించె.

ఇతి త్రైపక్షికాది శ్రాద్ధకాలాః సమాప్తాః.

అథ స్నానోదక నిర్ణయః.

శ్లో॥ మృతే జన్మని సంక్రాంతౌ శ్రాద్ధే పర్వణి జన్మని। అస్పృశ్యస్పర్శనే చైవ న స్నాయాదుష్ణవారిణా। అస్నాతదితథా యః స్నాయాదుష్ణవారిణా। స గోహత్యాకృతం పాపం ప్రాప్నోత్యేవ న సంశయః॥ తాళ్యా పంచమ్యాదితిథిక్షేషు పవిత్రమా। మలాఫేమంత్రిపూతా ఇతి॥

తా॥ జననమరణములయందును, సంక్రమణమందును, శ్రాద్ధమందును, పర్వతమునందును, అస్పృశ్యస్పర్శయందును, ఉష్ణోదకముచేత స్నానమును జేయఁగూడదు. రోగరహితుఁడై యుండియు ఏకార్యముల యందుష్ణోదకముచేత స్నానమునుఁజేయువాఁడు గోహత్యతోఁదుల్యమైన పాపమును చేసినవాఁడగును.

ఇతి స్నానోదక నిర్ణయస్సమాప్తః.

అథ జీవత్పితృకస్య అన్యశ్రాద్ధనిషేధః.

తండ్రి జీవించియున్న జ్ఞాతులు మాత్రము తిలోదకాదుల నీయఁగూడదు, జ్ఞాతులతోఁగూడ నాశౌచదినంబులందు సహవాసంబు నుజేయఁగూడదు, తండ్రి బ్రతికియున్నను తనతల్లిశ్రాద్ధమునుమాత్రము యథావిధిగా వారివారి కులాచారములనుబట్టి తప్పక చేయవలెను. తండ్రి జీవించియుండగా జ్యేష్ఠభ్రాతయైనను కనిష్ఠభ్రాతలైనను మృతి నొందినయెడల తిలోదకాది ప్రేతకృత్యంబులన్నియు తనతండ్రి చేయవలెను.

తిలతర్పణ నిషేధః. స్మృతిసారసంగ్రహే॥ శ్లో॥ తీర్థశ్రాద్ధే గయాశ్రాద్ధే ప్రేతశ్రాద్ధానుమాసికే। సపిండీకరణేచైవ నకుర్యాత్తిలతర్పణమ్॥ వృద్ధిశ్రాద్ధే సపిండ్యాచమాసికే చానుమాసికే। అబ్దికేప్రథమేచైవ నకుర్యాత్తిలతర్పణమ్॥ దర్శే తిలోదకంపూర్వం పశ్చాద్దద్యాన్మహాలయే। ప్రత్యబ్దేపరంపూర్వం పరేహానితిలోదకమ్। పిత్ర్యర్థాంగ తిలందద్యాన్నిషిద్ధేపి పరేహని। నగ్గైకస్యచోయేషా మన్యేషాంతు విసర్జయేత్॥

తా॥ తీర్థశ్రాద్ధమునందును, గయాశ్రాద్ధమునందును, ప్రేతశ్రాద్ధమునందును, అనుమాసిక శ్రాద్ధమునందును, ప్రథమాబ్దిక శ్రాద్ధమునందును, సపిండీకరణ శ్రాద్ధమునందును, వృద్ధిశ్రాద్ధమునందును, సాపిండ్యమునందును, మాసికాను మాసికములందును, తిలతర్పణము చేయఁగూడదు, దర్శశ్రాద్ధమునందు శ్రాద్ధకర్మాచరణమునకు ముందుగాను మహాలయశ్రాద్ధమునందు పిమ్మటను తిలతర్పణము జేయవలయును, ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు సద్యఃకాలమునందు తిలతర్పణము చేయఁగూడదు, పరదిన ప్రాతఃకాలమునందు, తిలతర్పణమును చేయవలెను, పరదినము తర్పణమును చేయుటకు నిషిద్ధదినమైనను తిలతర్పణమును చేసియే తీరవలయును. శ్రాద్ధమునందలి వర్గత్రయమునకే తిలతర్పణమును చేయవలయును గాని యితరులకు తిలతర్పణమును చేయఁగూడదని తా॥

స్మృత్యంతరే॥ శ్లో॥ నజీవత్పితృకఃకుర్యాచ్ఛ్రాద్ధాంగతిలతర్పణమ్। శ్రాద్ధమాత్రంప్రకుర్వీత తర్పణంతుపితాచరేత్॥

తా॥ జీవపితరులుగలవాడు శ్రాద్ధంబునుమాత్రం బొనర్పవలయును గాని శ్రాద్ధాంగ తిలతర్పణమును చేయఁగూడదు, ఆతర్పణంబును తండ్రియే చేయవలయు నని స్మృతికారులు వచించిరి.

ఇతి తిలతర్పణ నిషేధస్సమాప్తః.

తాంబూల చర్వణమ్

ప్రయోగపారిజాతే॥ శ్లో॥ పత్నీశ్రాద్ధతథాదర్శే యుగమన్వంతరాదిషు। శ్రాద్ధంనిర్వర్త్యభుక్త్వాతు తాంబూలంఖాదయేద్ద్విజః। మోహాద్యఃకృత్వాయశ్శ్రాద్ధం తాంబూలంయదిఖాదయేత్॥ శ్రాద్ధహంతా భవేత్కర్తా రౌరవంనరకంవ్రజేత్ పిత్రోః ప్రత్యాబ్దికేశ్రాద్ధే దివారాత్రౌ తాంబూలచర్వణంనిషిద్ధం అంగతిలతర్పణం పరేద్యుః ప్రాతర్విహితత్వేన స్యాత్ పితృకర్మనివృత్తిః॥

తా॥ పత్నీదర్శయుగమన్వంతరాదులయందు శ్రాద్ధకర్మ నాచరించి పిదప తాంబూలచర్వణాదికము చేయవచ్చును ఒకవేళ శ్రాద్ధము నాచరింపక తాంబూల చర్వణాదికము చేసినచో రౌరవాది నరకముల బొందుదురు తల్లిదండ్రుల యొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు మరదినప్రాతఃకాలమునందు తిలతర్పణంబు చేయువరకు తాంబూల చర్వణాదికముఁ జేయఁగూడదని తా॥

శ్లో॥ మృతాశౌచేతథాశ్రాద్ధే మాతాపిత్రోర్మృతేహని। ఉపవాసేచ తాంబూలం దివారాత్రౌవిసర్జయేత్॥

తా॥ మృతాశౌచమునందును, శ్రాద్ధదినమునందు, తల్లిదండ్రులయొక్క ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందును ఉపవాస వ్రతదినములయందును. తాంబూల చర్వణంబు గూడదు.

పిండనైవేద్యమ్.

శ్రాద్ధదర్పణే। శ్లో॥ భక్ష్యంచపిండనైవేద్యం వికిరాన్నంచస్పృశన్ తాంబూలచర్వణంకృత్వా పునశ్శ్రాద్ధంసమాచరేత్॥

తా॥ మినుములతోవండిన భక్ష్యమును పిండనైవేద్యము జేసినను, విక రాన్నము భోజనపాత్రకు స్పర్శతగిలినను కర్త తాంబూలము భక్షించినను తిరిగి శ్రాద్ధముఁజేయవలయునని శ్రాద్ధదర్పణమందు వ్రాయబడియె.

మాతుర్ద శాహమధ్యే పితృమృతిః.

స్మృత్యంతరే॥ శ్లో॥ మాతుర్దశాహమధ్యేతు పితాయస్య ప్రమీయతే। పైతృకంతుయథాకాలం పితుస్సర్వంసమాపయేత్॥ తతోమాతృత్రిపక్షాదా శేషం కర్మసమాపయేత్॥

తా॥ తల్లిమృతినొందిన దశాహమధ్య తండ్రిమృతినొందినయెడల తండ్రికి శ్రాద్ధము సంపూర్తిగాజేసి పిమ్మట 3 పక్షములలో అనగా ౧౦ దిన ములకు పిమ్మట ౫ దినములలో తల్లికి లోగడచేసిన క్రియలుగాక తక్కినశ్రాద్ధ మంతయు సమాప్తి జేయవలెనని తా॥

శ్లో॥ మాతుర్ద శాహమధ్యేతు మృతశ్చేద్యదివైపితా। పితుస్మరణమారభ్య దశాహంమాతకంభవేత్॥

తా॥ తల్లి దశాహమధ్యమందు తండ్రి మృతిబొందినయెడల తండ్రి మృతి బొందినది మొదలు ౧౦ దినములు మృతసూతకమని తా॥

ధర్మప్రవృత్తౌ॥ శ్లో॥ మాతాపిత్రోర్మృతాశౌచం దశాహంవిహితంబుధైః॥ పైతృకాదూర్ధ్వమేతస్యా మాతాశ్రౌచంతుపక్షిణీ॥

తా॥ తల్లి దండ్రి మొదలగువారి మృతులయందు ౧౦ దినములాశౌచము తండ్రియొక్క శ్రాద్ధముచేయుచుండగా ఊర్ధ్వభాగమునందు తల్లి చనిపోయిన యెడల మాతాశౌచము ఒకటిన్నర దినమని తా॥

శ్లో॥ ఆద్యశ్రాద్ధమశుద్ధోపి కుర్యాదైకాదశేహని। కర్తుస్తాత్కాలికాశుద్ధి రశుద్ధిఃపునరేవసః॥

తా॥ ఆద్యశ్రాద్ధంబును పరిశుద్ధుఁడై చేయవలయును ఈశ్రాద్ధము జేయుట వలన కర్తకు తత్కాలంబునందు పరిశుద్ధిగలుగునని తా॥

ఆశౌచ ఖండే శాతాతపః.

శ్లో॥ పితురాశౌచమధ్యేచె మాతుశ్రాద్ధంకథంభవేత్। దశాహే షోడ

కాత్ప్రశ్చాన్మాతుశ్శ్రాద్ధంవిధీయతే॥ మాతురాశౌచమధ్యే చేత్పితుశ్శ్రాద్ధం భవేద్యది॥ తదాత్రిహేషోడశాదర్వాక్తచ్ఛ్రాద్ధంతువిధీయతే॥ అస్యార్థః॥ ఏకాదశే హేపితుః షోడశాదిశ్రాద్ధంకృత్వా తతఃమాతుః ప్రత్యాబ్దికం కర్తవ్యం యేకాదశాహే ఆద్యశ్రాద్ధంనిర్వర్త్య పితుః మృతాహశ్రాద్ధంకృత్వాఅథఆద్యాదిషోడశ శ్రాద్ధానికారయేదిత్యర్థః॥

ఇతి మాతృదశాహమధ్యే పితృమృతి స్సమాప్తః.

## అధికమాస ప్రకరణము

తా॥ అధికమాసములలో మృతిబొందినవారికి తిరిగి ఆ మాసము యెప్పుడైనా అధికమాసము వచ్చినయెడల ఆమాసమునందే ప్రత్యాబ్దికము శుద్ధమాసములో చేయునక్కరలేదు, శుద్ధమాసమునందు మృతులైనవారికైతే అధికమాసమునందు అవసరములేదు, మాసికములు మాత్రము అధిక మాసమునందుకూడ శ్రాద్ధముచేయవలెను. అధికమాసములో మృతులైన వారికి శుద్ధమాసములో మృతదినమునకు లోగడదినమందు ఆన్వాద్యశ్రాద్ధముచేసి మృతతిథియందు ఊనమాసికము పెట్టవలెను. అక్కడనుంచి ౨౭ వ దినమందు నెలమాసికము పెట్టి 30 వ దినమందు ద్వితీయమాసికము బెట్టి అక్కడనుంచి ౧౫ దినములలోగా మధ్యపంచకమునందు త్రైపక్షికశ్రాద్ధముచేసి క్రమముగా సంవత్సరాంతము జరిగింపవలెను. సంవత్సరమధ్య అధికమాసము సంభవించేయెడల శుద్ధాదికములకు నొకటే సంకల్పము చేసి అధికమాసమునందే పెట్టవలెను. సంవత్సరాంతమందు అధికమువచ్చే పక్షమునకు ఊనాబ్దికమును సంవత్సర విమోకమును యీ 3 ను అధికమాసములోనే పెట్టవలెననదిగాని శుద్ధమాసంబున నాచరింపఁగూడదు మధ్యాధికవస్తే ప్రథమాబ్దికానికి లోగడ మాసానికే ౩౬౦ దినములు జరిగింపవలెననే మాట యుక్తముకాదు. ఆ రెండు మాసములు 30 దినముల సంజ్ఞే కనుక ప్రథమాబ్దికముతో గూడానే జరిగించవలయును. శుద్ధమాసమునందు మృతులైనవారికి ప్రథమాబ్దికము మలమాసం వచ్చినచో నప్పుడే చేయవలెను. ద్వితీయ ఆబ్దికాదులుమాత్రము శుద్ధమాసమునందే జరుపవలయును, తక్కిన విషయములు నిర్ణయసింధువునందు జూడఁదగును.

శ్లో॥ అగ్న్యాధేయంప్రతిష్ఠాంచ యజ్ఞదానవ్రతానిచ। దేవవ్రత వృషోత్సర్గ చూడాకరణ మేఖలాః। గమనం దేవతీర్థానాం వివాహమభిషేచనమ్॥ యానంచ గృహకర్మాణి మలమాసే విసర్జయేత్॥ ఇతిగర్గః॥

తా॥ అగ్న్యాధానము, ప్రతిష్ఠ, యజ్ఞ దానవ్రతములు, దేవ వ్రతములు, వృషోత్సర్జనము, చూడాకరణము, మేఖలము, దేవక్షేత్ర తీర్థాటనము, వివాహము అభిషేచనము, యానమును, గృహకర్మములును అశుఃకర్మలను మలమాసమునందు విడువవలెను.

శ్లో॥ అవశ్యకర్మ మాసాఖ్యం మలమాసమృతాబ్దికమ్। తీర్థేభచ్ఛాయయోః శ్రాద్ధం మఖకర్మపితృక్రియాః॥ కుర్యాన్మలిమ్లు చేవర్షేమధ్యే చేత్సతథాధికమ్॥ తత్రస్యాన్మాసికంమృత్యు మాసాత్ప్ర ద్వాదశోయది। ప్రేతక్రియాం సమాప్యాత్ర కుర్వీతాభ్యుదయంతథా। శ్యామాకాగ్ర యణంకృచ్ఛ్రత్రయ వర్జ్యమతోన్యథా॥

తా॥ మలమాసమునందు అవశ్యముగాఁ జేయఁదగిన మాసికాదికర్మములును, ఆబ్దికములును, తీర్థఁశ్రాద్ధములును, యజ్ఞకర్మములును, పితృక్రియలును చేయవచ్చునని యెఱుఁగవలెను మఱియును వర్షమధ్యమందు మలమాసము వచ్చెనేని నప్పుడు అధిక మాసములు గ్రహింపవలెను, మలమాసము మొదలుకొని పదిరెండవ మాసము మలమాస మయ్యెనేని దానియందు ప్రేతకర్మలను సమాప్తిని బొందించి పిమ్మట అభ్యుదయ కర్మలను జేయవలెను అని సూర్యోదయను గ్రంథమందు జెప్పబడియె.

### శ్రాద్ధదినే గృహాలంకార నిషేధః

యల్లాజీయ్యే॥ శ్లో॥ గోమయేనోప లేపంచ సర్వశ్రాద్ధే ప్రకీర్తితం। గృహాలంకరణం నాస్తి ఇతిశాతాత పోబ్రవీత్॥

తా॥ సమస్త శ్రార్ధదినంబు లందునను గోమయముచే భూమి నలుకవచ్చును గాని ముగ్గులు మొదలగునవి పెట్టగూడదని శాతాతపుఁడు చెప్పెను.

అథ ఉష్ణవారి నిషేధః. శ్లో॥ మృతేజన్మనిసం క్రాంతౌ శ్రాద్ధే జన్మ దినేతథా। అస్పృశ్య స్పర్శనేచైవ నస్నాయాదుష్ణ వారిణా। సగోహత్యా కృతం పాపం ప్రాప్నోత్యేవ నసంశయః॥

తా॥ మరణాశౌచము నందును, జాతాశౌచము నందును, సంక్రమణ దినమందును, శ్రాద్ధదినమందును, జన్మదినమందును, తాకగూడని వస్తువును తాకినప్పుడు, వేడినీళ్ళతో స్నానము చేయగూడదు, అట్లు చేసినవాడు గోహత్య చేసినంత పాపము బొందుచున్నాఁడు.

అథ దేవతార్చన నిషేధః. శ్లో॥ దానాధ్యయన దేవార్చా ఉపహోమ వ్రతాదికం। నకుర్యాచ్ఛ్రాద్ధదివసే ప్రాగ్విప్రాణాం విసర్జనాత్॥

తా॥ శ్రాద్ధదినమందు శ్రోక్త్రలు భుజింపక పూర్వము, దానము, అధ్య యనము, దేవతాపూజ, ఉపహోమము, వ్రతము మొదలగునవి చేయఁగూడదు.

అథ ఆచమన కాల నిర్ణయః.

శ్లో॥ ఆదావంతేచ పాద్యేచ విష్కరేచే విశేషతః॥ ఉచ్ఛిష్టే పిండదానేచ షట్స్వాచామనంస్మృతమ్॥

తా॥ ప్రారంభమందును, అంతమందును, పాదప్రక్షాళనమందును, అసన మిచ్చినప్పుడు, ఉచ్ఛిష్టాన్న విసర్జన మందును, పిండప్రదానమందును ఈ ఆరు సమయములందును ఆచమనముఁ జేయవలెను.

ఆశ్వలాయనానాం గోత్రోచ్చారణక్రమః.

శ్లో॥ సపిండీకరణాత్పూర్వ మాశ్వలాయనశాఖినాం। గోత్రం బ్రూయా త్ప్రథమతః పశ్చాన్నామాధికం వదేత్॥

తా॥ ఆశ్వలాయన శాఖవారు సపిండీకరణము చేయక పూర్వము ముందుగా గోత్రమును చెప్పి పిమ్మట పేరు చెప్పవలయును.

అథ విష్ణ్వర్చనవిధిః దక్షః॥ శ్లో॥ యత్కించిత్పార్వణం శ్రాద్ధం తత్ర సర్వత్రచద్విజే। పూజయేద్విష్ణుమిత్యేవ మితిప్రాహ పితామహః॥

తా॥ పార్వణయుక్తమైన యే శ్రాద్ధము జేసినను బ్రాహ్మణుని యందు విష్ణుమూర్తి నావాహనముజేసి పూజింపవలయునని బ్రహ్మ చెప్పెను.

భారతే॥ శ్లో॥ యచ్ఛ్రాద్ధం పార్వణం ప్రోక్తం తచ్ఛ్రాద్ధం వైష్ణవం వినా। కృతం నశ్యతికౌంతేయ పతితే నేక్షితం యథా॥

తా॥ ఏశ్రాద్ధము పార్వణ సహితముగా నాచరింపఁబడునో అట్టి శ్రాద్ధము విష్ణుదైవత్యము లేకుండ జేసినయెడల వర్ణభ్రష్టునిచే జూడబడిన శ్రాద్ధము వలెనే చెడిపోవునని భారతమునందుఁ జెప్పబడియె.

శ్లో॥ దర్శమహాలయే తీర్థే సపిండీకరణే తథా। వ్యర్థంభవతి తచ్ఛ్రాద్ధం వాసుదేవం వినాకృతమ్॥

తా॥ దర్శ శ్రాద్ధము, మహాలయము, తీర్థశ్రాద్ధము, సపిండీకరణము ఈ శ్రాద్ధములను విష్ణుస్థానము లేకుండా చేసినయెడల ఆ శ్రాద్ధములు వ్యర్థమగును,

(పాదప్రక్షాలనే కర్తుః పశ్చిమాభి ముఖత్వనియమః.)

వ్యాసః॥ శ్లో॥ ప్రాతఃకాలేచ మధ్యాహ్నే సాయాహ్నే నిశి సంధ్యయోః। పశ్చిమాభిముఖ శ్శ్రాద్ధే విప్రపాదాభిషేచనం॥

తా॥ శ్రాద్ధదినమందు ప్రాతఃకాలము నందుగాని మధ్యాహ్నము నందు గాని, సాయంకాలము నందుగాని, రాత్రియందుగాని, సంధ్యాకాలమందుగాని బ్రాహ్మణులకు పాదప్రక్షాళనము పశ్చిమ ముఖముగా కూర్చుండి చేయవలెననీ వ్యాసుఁడు చెప్పెను.

పాదప్రక్షాళనే కర్తృభోక్త్రూపవేశన విధిః.

యల్లాజీయే॥ శ్లో॥ విప్రక్షాళన కాలేతు దాతాభోక్తా ద్విజోత్తమః। సుఖాసీనో భవేచ్ఛ్రాద్ధే త్వన్యథా నరకం వ్రజేత్॥

తా॥ శ్రాద్ధంబునందు పాదప్రక్షాళన చేయునప్పుడు కర్తయును భోక్తయును కూర్చుండవలయును, లేనియెడల నరకమును బొందును.

భోక్తురాశౌచం.

వా॥ భోక్తుస్తృతీయ నిమంత్రణ ప్రభృత్యా శౌచాభావః। తత్పూర్వ మాగతంచేత్ ఆశౌచమస్త్యేవ॥

తా॥ భోక్తకు మూడవపర్యాయము నిమంత్రణమైనది మొదలు ఆశౌచము లేదు. అందుకుపూర్వము ఆశౌచము వచ్చినయెడల ఆశౌచముండును.

(కర్తురాశౌచం)

వా॥ కర్తుస్తు ప్రారంభానంతర మాశౌచాభావః। తత్పూర్వంచే దాశౌచ మస్త్యేవ॥

తా॥ కర్తకు శ్రాద్ధ ప్రారంభము మొదలు ఆశౌచములేదు. ప్రారంభించక పూర్వము ఆశౌచము వచ్చినయెడల ఆశౌచము కలదు.

ప్రారంభ వివరమ్.

వా॥ పాకసమాప్తిః ప్రారంభ ఇత్యేకః పక్షః। సంకల్పః ప్రారంభ ఇత్యేకః పక్షః। పాకాది ప్రోక్షణ మారంభ ఇత్యేకః పక్షః। తృతీయ నిమంత్రణ ఇత్యేకః పక్షః। యేతేషుపాక పరిసమాప్తి పక్ష ఆపద్విషయః ఆశక్త విషయశ్చ

ఇతరేషు పక్షేషు తత్తద్దేశశిష్టాచారో నువర్తనీయః॥ యేతేషు చతుర్షు పక్షేషు ఆశౌచసంప్రాప్తౌ కర్తా సద్యస్స్నాత్వా స్వయమేవ శ్రాద్ధం కుర్యాత్। పక్వాన్న మన్యేన అశౌచరహితేన పరివేషయేత్। భోజన ప్రారబ్ధ మన్నం భోక్తా ప్రోక్షేత్। కర్తా తద్భోజనపాత్ర మస్పృశన్నేవ అన్న త్యాగం కుర్యాత్॥

తా॥ వంట చేయుట పూర్తియగుట ప్రారంభమని యొకపక్షము. సంకల్పం చేయుట ప్రారంభమని యొకపక్షము, వంటపదార్థము మీద ప్రోక్షించుట ఆరంభమని యొక పక్షము మూడవ పర్యాయము నిమంత్రణము చేయుట ప్రారంభమని యొక పక్షము. యీ నాలుగు విధములలో వంట చేయుట పూర్తియగుటయే ప్రారంభమనునది యావత్తు సంభవించినప్పుడును శక్తి లేనప్పుడును చెప్పతగినది మిగిలిన విధములలో ఆయా దేశములలో శిష్టుల యాచార ప్రకారముగా నాచరింప వలయును. యీ నాలుగు పక్షములయందును ఆశౌచము రాగానే కర్త తత్కాల మందే స్నానము చేసి తానే శ్రాద్ధము పెట్టవలయును. అప్పుడు ఆశౌచములేని మఱియొకనిచే పదార్థములు వడ్డించునట్లు చేయవలయును, పిమ్మట భోక్తయే పదార్థమును ప్రోక్షించవలయును. కర్త భోక్తయొక్క భోజనపాత్రను స్పృశింపకుండ శ్రాద్ధమంతయుఁ జేయవలయును.

జాను నిక్షేప విధిః. శ్లో॥ నిక్షిప్య దక్షిణం జానుం దేవాన్ పరిచరేత్సుధీః భూమౌ తథా పరం జానుం పితౄన్పరిచరేత్సదా॥

తా॥ తెలిసినట్టివాడు దేవతాపూజ చేయునప్పుడు కుడిమోకాలును పితృపూజఁ జేయునప్పుడు ఎడమమోకాలును భూమియందు ఆనించవలెను.

ఘృత పాత్ర నిధానమ్.

శ్లో॥ మాషేవా పరమాన్నేవా ఘృతపాత్రం నిక్షిపేత్। తద్భోజ్య మాసురం ప్రాహుర్న దాతుః పారలౌకికం॥

తా॥ నేతి దొన్నెను పప్పుయందును పరమాన్నము నందును నుంచకూడదు అట్లు చేసిన యెడల ఆ భోజనము రాక్షసభోజనము శ్రాద్ధకర్తకు సుకృతము లేదు.

చిత్రగుప్త బలి నిషేధః.

శ్లో॥ దత్తే వాప్యథవాదత్తే భూమౌయో నిక్షిపేద్బలిం। తదన్నం విఫలం యాతి నిరాశాః పితరోగతాః॥

తా॥ త్యాగము చెప్పక పూర్వమునందు గాని, చెప్పిన పిమ్మట గాని, భూమియందు చిత్రగుప్తునికి ఉంచియుండెడల ఆ యన్నము వ్యర్థమగుచున్నదని పితృదేవతులు ఆశను వదలుకొని తిరిగిపోవుచున్నారు. అనఁగా శ్రాద్ధమునందు చిత్రగుప్తబలిని విడువవలెను.

(సు వా సి నీ భో జ న వి ధిః.)

యల్లాజీయే॥ శ్లో॥ సువాసిన్యాం మృతాయాంతు బ్రాహ్మణైస్సహ భోజనే। సువాసినీంతతః పశ్చాద మంత్రికమథార్చయేత్॥

తా॥ సువాసినీ మృతినొందిన యెడల బ్రాహ్మణులతోగూడ సువాసినీ భోజనం పెట్టవలెను మంత్రవిద్యుక్తముగా ముత్తైదును పూజించనక్కరలేదు.

అధిశ్రవణ ఫలమ్. శ్లో॥ అధిశ్రవణ హీనంతు శ్రాద్ధం కుర్వీత మూఢధీః। తదన్నంమాంస తుల్యంచ తద్ఘృతం సురయాసమమ్॥

తా॥ ఏ మూఢుడైనను అధిశ్రవణము లేకుండా శ్రాద్ధము నాచరించిన యెడల ఆయన్నము మాంసముతో సమానమనియు నెయ్యి కల్లుతో సమానమనియు జెప్పఁబడెను.

పితృ సూక్త నిషేదః. శ్లో॥ షోడశే మాసికే చైవతీర్థే చైవసపిండనే। నిత్యశ్రాద్ధోద కుంభేచ పితృసూక్తానివర్జయేత్॥

తా॥ షోడశమునందును, మాసికమునందును, తీర్థశ్రాద్ధమందును, సపిండీకరణమందును, నిత్యశ్రాద్ధమునందును, ఉదకుంభ శ్రాద్ధమందును, పితృసూక్తములను విడువవలయును.

పిం డ దూ ష ణె.

యల్లాజీయే॥ శ్లో॥ మార్జాల మూషిక స్పర్శే పిండేచ ద్విదళీకృతే। పునశ్శ్రాద్ధం విధాతవ్యం తేనపాకేన తత్క్షణాత్॥ [వాక్యం] పునశ్రాద్ధం నామ పునః పిండదాన మిత్యర్థః॥

తా॥ పిండములను పిల్లి యెలుక మొదలగునవి ముట్టుకొన్నను పిండము విడిపోయినను తిరిగి శ్రాద్ధముఁ చేయవలెను అనఁగా తిరిగి పిండములను చేయవలయునని తాత్పర్యము.

## కర్తృశ్రాద్ధ శేషాన్న భోజన విధిః.

శ్లో॥ ప్రదక్షిణమను వ్రజ్య భుంజీత పితృసేవితం॥ మాధవీయే॥ శ్రాద్ధం కృత్వాతుయోవిప్రో నభుంజీత కదాచన। దేవాహవ్యం నగృహ్ణంతి కవ్యంతు పితరస్తథా।

తా॥ బ్రాహ్మణులకు ప్రదక్షిణము చేసి వారిని పంపించి శ్రాద్ధ శేషాన్నమును కర్త భుజింపవలెను. ఏ బ్రాహ్మణుఁడైనను శ్రాద్ధము నాచరించి పితృశేషమును భుజింపకుండా విడిచెనేని దేవతలు హవ్యమును గ్రహింపరు. పితృదేవతలు కవ్యమును గ్రహింపరు అని మాధవీయమందుఁ జెప్పబడెను.

## ఉపవాసే శ్రాద్ధ శేషాన్న భోజన నిషేధః.

నిర్ణయసింధౌ॥ శ్లో॥ ఉపవాసదినేనిత్య శ్రాద్ధం నైమిత్తికంభవేత్। ఉపవాసం తదాకుర్యా దాఘ్రాయ పితృసేవితమ్॥

తా॥ నియతముగా తానుపవాసముచేయు దినమందు శ్రాద్ధము సంభవించిన యెడల శ్రాద్ధ మాచరించి కణము నాఘ్రాణించి పిమ్మట నుపవాసము చేయవలెను

## భిన్నగోత్రాణాం పితృశేషాన్న భోజన నిషేధః.

శ్లో॥ పితాదీనాం తథాన్యేషాం శ్రాద్ధ శేషాన్న భోజనం। వ్రతినాం విధవానాంచ యతీనాంచ వివర్జితమ్॥ అన్యైర్భిన్నగోత్రైః వ్రతినో బ్రహ్మచారిణః॥ సగోత్రాణాం పితృశేష భోజనానుమతిః॥

తా॥ శ్రాద్ధ శేషాన్నమును భుజించుట ఇతర గోత్రీకులకు బ్రహ్మచారులకు విధవలకు యతీశ్వరులకు నిందితమైనది.

శ్లో॥ శ్రాద్ధావశిష్ట భోక్తారస్తేవై నిరయగామినః। సగోత్రాణాం సకుల్యానాంజ్ఞాతీనాంచన దోషకృత్। అన్యగోత్రాణాం క్వచిత్పితృశేష భోజనానుమతిః॥

తా॥ శ్రాద్ధ శేషాన్నమును భుజించినవారు నరకమును బొందుదురు. సగోత్రులకు, సకుల్యులకు, జ్ఞాతులకు, మాత్రము నిషేధము లేదు.

శ్లో॥ శ్వశురస్య గురోర్వాపి మాతులస్య మహాత్మనః। జ్యేష్ఠ భ్రాతుస్తు పుత్రస్య బ్రహ్మ నిష్ఠస్య యోగినః। యేతేషాం శ్రాద్ధ శేషాన్నం భుక్త్వాదోషోన విద్యతే॥

తా॥ మామ, గురువు, మేనమామ, శ్రేష్ఠుఁడు, అన్న, కుమారుడు, బ్రహ్మజ్ఞాని, యోగీశ్వరుఁడు నీ మొదలగు వారియొక్క పితృశేషమును భుజించినను దోషము లేదు.

### శూ ద్ర స్య పి తృ శే షా న్న దా న ని షే ధః.

యల్లాజీయ్యే॥ శ్లో॥ నశూద్రం భోజయేత్తస్మిన్ గృహే యత్నేన తద్దినే। శ్రాద్ధశేషం నశూద్రాయ దదాతిచ బలేష్వపి। శూద్రంతు భోజయిత్వా యో దద్యాచ్ఛ్రాద్ధేషు మానవః। శ్రాద్ధ విష్పీడితా యాంతి శ్రాద్ధం దేవాశ్చ తత్క్షణాత్॥

తా॥ శ్రాద్ధదినమందు శ్రాద్ధ మాచరింపబోవు గృహమునందు శూద్రునకు భోజనము పెట్టగూడదు, పితృశేషమును శూద్రునకు పెట్టగూడదు మరి యెచ్చటనైనను తాను ముందుగా శూద్రునకు భోజనం పెట్టగూడదు ఇట్లు భిన్నముగా నాచరించిన యెడల శ్రాద్ధము భంగమైనదానిగా నెంచి శ్రాద్ధదేవతలు తక్షణము నందే వెళ్ళిపోవుదురు.

### (ఆశౌచమధ్యే సంప్రాప్త శుద్ధిదినే కార్యశూన్యతిథౌ శ్రాద్ధనిషేధః)

వసిష్ఠః॥ శ్లో॥ ఆశౌచమధ్యే పిత్రోశ్చ భవేన్మృత తిథిస్తదా। అతిథిం వర్జయిత్వాంతే ప్రత్యబ్దం కారయేత్సుతః॥

తా॥ తల్లి దండ్రుల మృతదినములు ఆశౌచ క్రాంతము లైనప్పుడు శూన్య తిథియందు శుద్ధియగునేని యా దినము విడచి మరునాడు పెట్టవలయునని వసిష్ఠుఁడు చెప్పెను.

దక్షః॥ శ్లో॥ ఆశౌచమధ్యే పిత్రోశ్చ యథామృత తిథిర్భవేత్। ఆశౌచాంతే శూన్యతిథౌ నకుర్వంతి తిథింబుధాః॥

తా॥ ఆశౌచ నడుమ తల్లి తండ్రుల మృతిదినంబులు సంభవించిన యెడల శుద్ధిదినము శూన్యతిథి యగునేని యా దినంబున శ్రాద్ధము తెలిసినవారు విసర్జింతురని దక్షుఁడు చెప్పెను.

### శూ న్య తి థ్య నం త ర ది నే క ర్త వ్య త్వ వి ధిః.

శ్లో॥ శూన్యతిథ్యాముపోష్యైవ శ్రాద్ధం కుర్యాత్పరేహని కృత్వాసమ్యగ్విధానేన బంధుభిస్సహ భోజయేత్॥

తా॥ ఆశౌచ శుద్ధిదినము శూన్యతిథి యగునేని యా దినంబున నుపవాసముండి మరుసటి దినంబున యథావిధిగా శ్రాద్ధము నాచరించి బంధువులతోఁగూడ భుజింపఁదగును.

సంవత్సర విమోక శ్రాద్ధవిధిః

శ్లో॥ వత్సరాంతే విమోకాఖ్యం శ్రాద్ధంపార్వణ వచ్చరేత్। మృతస్య తృప్తయే కార్యం యద్యాశౌచదినేపివా। ఆశౌచదినం నామశూన్య తిథి।

తా॥ మృతినొందినవాని తృప్తి నిమిత్తమై సంవత్సరాంతము నందు శూన్య తిథి యైనప్పటికిని సంవత్సర విమోకమును శ్రాద్ధమును పార్వణ సహితముగా యథా విధిగా నాచరింపవలయును.

శ్రాద్ధ హీన తిథి శూన్య తిథిః.

శ్లో॥ అబ్దస్యాంతే విమోకాఖ్యం శ్రాద్ధం ప్రథమ వత్సరే। కుర్యాత్పా ర్వణవచ్చైవ శ్రాద్ధ హీనతిథౌయది॥

తా॥ సంవత్సరాంతమునందు సంవత్సరాంతమునందు సంవత్సర విమోకము నుశ్రాద్ధమును పిమ్మట సంవత్స రారంభమునందు ప్రథమాబ్దికమును శూన్యతిథి సంభవించి నప్పటికిని పార్వణ సహితముగా శ్రాద్ధమును యథా విధిగా నాచరింప వలయును.

శ్లో॥ మృతస్య వత్సరాంతేతు యదిశూన్య తిథిర్భవేత్। తస్మిన్ దినే విమోకాఖ్యం కర్తవ్య మవిచారతః॥ సంవత్సర విమోకాఖ్య మకృత్వా ప్రథ మాబ్దికం। యచ్ఛ్రాద్ధంకురుతేమోహాత్ కృతంకర్మ నిష్ఫలమ్॥

తా॥ సంవత్సరాంతమునందు శూన్యతిథిసంభవించినప్పటికిని యా దినమందు మృతినొందిన వానియొక్క తృప్తికొఱకు సంవత్సరవిమోకము శ్రాద్ధమును చేయవలయును ఏమియు నాలోచింప నక్కఱలేదు.

స్మృతిదీపికాయాం॥శ్లో॥ ఆశౌచాదినిమిత్తైశ్చ విమోకాఖ్యమతిక్రమేత్। తదాయనిపిమోకాఖ్యం నకర్తవ్యమితీరితమ్॥

తా॥ సంవత్సర విమోకమను శ్రాద్ధమునాచరింపక అజ్ఞానముచే ప్రథమాబ్దికమును బెట్టినయెడల ఆ చేసిన కర్మయంతయు నిష్ఫలమగును.

దేశాంతరగత భ్రాతౄణాం ప్రత్యాబ్దికాను మాసికాదివిధిః.

శ్లో॥ విభక్తోవా విభక్తోవా దేశాంతర గతస్సుతః। పృథక్ఛ్రాద్ధం ప్రకుర్వీత

మాతాపిత్రోర్మృతేహని । అవిభక్తోవిభక్తోవా దేశాంతరగతో యది। కర్తవ్యం తైరమావాస్యా ప్రత్యబ్దమనుమాసికం॥ గ్రంథాంతరే॥ అవిభక్తస్సుతః కుర్యాద్దేశే పిత్రోర్మృతాహికం । స్థానాంతరే పృథక్కుర్యాద్దర్శశ్రాద్ధానుమాసికే॥

తా॥ కుమారుఁడు విభక్తుడైనను విభక్తుడు కాకున్నను దేశాంతరం వెళ్లినప్పుడు తల్లిదండ్రుల శ్రాద్ధదినంబులు సంభవించెనేని యాదినంబున తాను శ్రాద్ధము తప్పక నాచరింపవలెను తనయులు విభజించుకొన్నను విభజించుకొనకపోయినను దేశాంతరము వెళ్ళినప్పుడు ప్రత్యాబ్దికము, దర్శశ్రాద్ధము, ప్రతినెలమాసికము వేరుగా నచ్చట నాచరింపవలయును అన్నదమ్ములు వేరుపడకపోయినను వారిలో నొకడు దేశాంతరము వెళ్ళినప్పుడు తల్లితండ్రుల శ్రాద్ధములను ప్రతినెల మాసికమును దర్శశ్రాద్ధమును తాను ప్రత్యేకముగానైనను చేయవలయునని మఱియొక గ్రంథమునందుఁగూడ జెప్పఁబడెనని తా॥

## అథ శ్రాద్ధనిమంత్రితగాయత్రీ జపసంఖ్యా.

శ్లో॥ ప్రత్యబ్దే త్రిశతంచైవ మాసికే శతపంచకమ్ । ద్విసహస్రం సపిండే చ అయుతం ప్రేతభోజనే॥

తా॥ ప్రత్యాబ్దికమందు మూడువందలును, మాసికమందు అయిదువందలును, సపిండీకరణమునందు రెండువేలును, ప్రేతభోజనము సంభవించినచో పదివేలును, గాయత్రీమంత్రజపమును పరదినంబున భోక్త పఠించవలయును.

## ఉపనయన వివాహానంతరే శ్రాద్ధకర్తవ్యత్వవిధిః.

శ్లో॥ మౌంజీబంధాద్వివాహాచ్చ వర్షాత్సంవత్సరమేవవా। నకుర్యాత్పిండనిర్వాపం నదద్యాత్తిలోదకం॥ శ్లో॥ పుత్రీపుత్రవివాహయోశ్చ పరతష్షణ్మాసతోభ్యంతరే। పిత్రోరాబ్దికపైతృకేషువిధివత్ దూర్వాక్షతైరర్చయేత్ । దధ్యన్నంబదరీఫలైశ్చసహితం పిండాన్ వికిర్యాపసవ్యం తిలతర్పణంచహి తథాదర్భాం స్తిలాన్ వర్జయేత్ ॥

తా॥ ఉపనయనమైన పిమ్మటను వివాహమైన పిమ్మటను ఆఱుమాసములవఱకుగాని సంవత్సరమువఱకుగాని పిండప్రదానము తిలతర్పణము చేయఁగూడదు కుమార్తె కుమారుల వివాహములు జరిగినపిమ్మట ఆఱుమాసములలోపల తల్లిదండ్రుల ఆబ్దికములు సంభవించినయెడల గరికెలు అక్షతలుతోటి శ్రాద్ధమునందు అర్చనచేయవలెను పిండములను పెరుగు రేగుపండ్లు మొదలగువానితో మిశ్రితము చేయవలెను వికిరాన్నము, అపసవ్యము, తిలతర్పణము, తిలలు, దర్భలు, మొదలగునవి విడువవలెను.

అనేకశ్రాద్ధ సన్నిపాతే. శ్లో॥ మాతాపిత్రోః క్షయేప్రాప్తే యదిదర్శే సమాగతే । పితృశ్రాద్ధంతు పూర్వంస్యాత్ మాతృ శ్రాద్ధమతఃపరం॥ తర్శశ్రాద్ధంతతః పశ్చాత్పార్వణస్తు మహాలయే । దర్శసంక్రమణేప్రాప్తే తచ్ఛ్రాద్ధంతుకథంభవేత్ అమాశ్రాద్ధం నకర్తవ్యం కర్తవ్యం సంక్రమోదితః। సంక్రమేగ్రహణే దర్శేతచ్ఛ్రాద్ధంతు కథంభవేత్ । ఉపరాగప్రయుక్తంతు సమకాలేసమాచరేత్ । దర్శేతు మాసికేప్రాప్తే మాసికం పూర్వమాచరేత్ । దర్శప్రత్యాబ్దికేప్రాప్తే ఆబ్దికం పూర్వమాచరేత్ ।నిత్యనైమిత్తికే ప్రాప్తేనిత్యం నపరిలంఘయేత్। నైమిత్తికంపురాకుర్యాత్తతోనిత్యం సమాచరేత్ ॥

తా॥ ఒక్కదినంబున తల్లిదండ్రుల శ్రాద్ధంబులు దర్శశ్రాద్ధము మొదలగు నవేక శ్రాద్ధములు సంభవించినప్పుడు ముందుగ తండ్రి తిథియు పిమ్మట మాతృ శ్రాద్ధమును అనంతరము దర్శశ్రాద్ధమును పిమ్మట మహాలయ శ్రాద్ధము నాచరింపవలెను, ఒక్కదినంబున దర్శ సంక్రమణ శ్రాద్ధంబులు సంభవించినయెడల సంక్రమణశ్రాద్ధము నాచరింపవలెను. దర్శశ్రాద్ధము చేయనక్కరలేదు. సంక్రమణ గ్రహణ దర్శశ్రాద్ధంబు లొక్కదినంబున సంభవించినయెడల గ్రహణ సంక్రమణ శ్రాద్ధంబు లొక్కపర్యాయము నాచరించవలెను. దర్శశ్రాద్ధము మాసికము నొక్క దినంబున సంభవించినయెడల ముందుమాసికముపెట్టి పిమ్మట దర్శశ్రాద్ధము నాచరింపవలెను, దర్శశ్రాద్ధము ఆబ్దికము నొక్కదినంబున సంభవించినయెడల ముందుగా నాబ్దికము పెట్టవలెను నిత్యనైమిత్తికములు సంభవించినప్పుడు నిత్యకర్మను ఎప్పుడును విడువఁగూడదు ముందుగా నైమిత్తిక కర్మను జేసినపిమ్మట నిత్యకర్మను జేయవలెను.

గ్రహణేఆశౌచ స్నాతకాభావః.

శ్లో॥ చంద్రసూర్యగ్రహేస్నాయాత్ సూతకేమృతకేతథా । అస్నాయీ మృత్యుమాప్నోతి స్నాయీమృత్యుంనవిందతి॥ సూతకేమృతకేచైవ నదోషోరాహుదర్శనే । తావదేవభవేచ్ఛుద్ధిర్యావన్ముక్తిర్నదృశ్యతే ॥

తా॥ సూర్యచంద్రగ్రహణములయందు, జాతాశౌచ మృతాశౌచములయందును స్నానము చేయవలెను, అట్లు స్నానము చేయనియెడల మృత్యువును బొందును, స్నానముచేసినయెడల మృత్యుభయం కలుగదు జాతాశౌచ మృతాశౌచ దినములలో గ్రహణం సంభవించినయెడల గ్రహణముక్తి పర్యంతమాశౌచములేదు.

జీవత్పితృకస్య తర్పణనిషేధః.

శ్లో॥ జీవమానః పితాయస్య మాతాయదివిపద్యతే । మాతృశ్రాద్ధం సుతః।

కుర్యాన్న కుర్యాత్తిలతర్పణమ్ ॥

తా॥ తండ్రి జీవించియుండగా తల్లిమృతినొందినయెడల తల్లికి శ్రాద్ధకృత్యము నంతయు చేయవలయును తిలతర్పణము మాత్రము చేయనక్కరలేదు.

బోధాయనామావస్యా నిర్ణయః.

శ్లో॥ భూతేహ్న్యమాయుతేయుగ్మా పశ్చాదేహ్న్యయ మేతిచేత్ । బోధాయ నానాంభూతేమాశ్రాద్ధం కుర్యామితోన్యథా ॥

తా॥ చతుర్దశి 8 యామంబులు అమావాస్యయు సంభవించినయెడల ఆదినం బున బోధాయన అమావాస్యయనంబడును.

సౌరమానతిథినిర్ణయః. శ్లో॥ జన్మర్క్ష తర్క్ష మృతాన్యహాని ఇత్యేకమాసేచ పునర్భవాని । పునర్భదౌహ్న్యేవహికర్మ కుర్యాత్తిష్యేవసంక్రాంతియు తేష్వైవ మాస్యే తస్మిన్ద్వితీ చేత్సరాస్యాత్పూర్వేద్యస్మిన్ త్పూర్వకసంక్రాంతియుక్తే । ద్వావప్యేతౌసంక్రమేచ త్వరస్యసర్వం చైవంచంద్రమానోప్యపరాగే । వృశ్చికా దిత్రిమాసేషు మృతాహాసంభవేద్యది । పూర్వమాసేతు కర్తవ్యమితికాతావపా బ్రవీత్ । ఊర్ధ్వంముహూర్తంకుతపా స్సంక్రాంతిర్యది దృశ్యతే । పూర్వమాసేన కర్తవ్యం కుర్యాత్ప్రాక్కుతపాదపి॥

సూతకాంతరిత శ్రాద్ధనిర్ణయః.

శ్లో॥ శుచిభూతేనదాతవ్యా యాతిథిఃప్రతిపద్యతే । సాతిథిస్తస్యకర్తవ్యా నచాన్యాపైకదాచన॥ ఇతిబుధ్యశృంగః॥

తా॥ జాతాశౌచమృతాశౌచ దినములలో అబ్దికము సంభవించిన యెడల శుద్ధిదినమునందు అబ్దికము పెట్టవలయునుగాని మఱియొకదినమునందు పెట్టగూడదు అని బుధ్యశృంగుడు చెప్పెను.

శ్రాద్ధవిఘ్నే ఆమశ్రాద్ధవిధిః

శ్లో॥ శ్రాద్ధవిఘ్నే ద్విజాతీనా మామశ్రాద్ధం ప్రకీర్తితం । అమావాస్యాది నియతం మాససాంవత్సరాదృత ఇతి॥ ఇతిహారీతః ॥

తా॥ శ్రాద్ధమునకు విఘ్నము సంభవించినప్పుడు దర్శశ్రాద్ధము, మాసి కము, అబ్దికము, మొదలగునవి ఆమద్రవ్యములచేతనే బ్రాహ్మణులు చేయదగినవని హారీతుడు చెప్పెను.

మరీచిః॥ శ్లో॥ అనగ్నికః ప్రవాసేచ యస్యభార్యారజస్వలా ॥ ఆమశ్రాద్ధం ద్విజఃకుర్యా న్నతుకుర్యాత్కృతేహని.

తా॥ అహితాగ్ని కానివాడు, ప్రయాణమందున్నప్పుడు భార్య బహిష్ఠయైన మృతదినము నందును ఆమశ్రాద్ధమును చేయవచ్చును.

లోగాక్షిరపి॥ శ్లో॥ పుత్రవత్స్వపిదారేషు విదేశస్థోప్యనగ్నికః । అన్నేనైవాబ్దికంకుర్యాద్ధేమ్నావామేనవాక్యచిత్ ॥

తా॥ భార్యబహిష్ఠురాలైనను, పరదేశము నందుండిన, భార్యాగ్ని కానివాడైనను అన్నశ్రాద్ధమునే చేయవలెను, అది సంభవము కానిపక్షమందు హిరణ్యశ్రాద్ధము చేయవలెను, అది సంభవము కాని పక్షమున ఆమశ్రాద్ధమైనను చేయవలెను అని లోగాక్షివచనము.

స్త్రీకర్తృకశ్రాద్ధము. శ్లో॥ అపుత్రాతుయదాభార్యాసంప్రాప్తే భర్తురాబ్దికే। యది రజస్వలాభవేత్సాతు కుర్యాత్తత్పంచమేహని॥

తా॥ సంతానము లేనట్టి స్త్రీ రహితయైయుండగా అట్టి సమయమునందు పెనిమిటి యాబ్దికము సంభవించిన యెడల అయిదవ స్నానదినమున ఆబ్దికము పెట్టవలయును.

ప్రభాసఖండే॥ శ్లో॥ విశుద్ధస్యాచ్ఛుద్ధేహ్ని స్నానాస్నారీ రజస్వలా । దైవేకర్మణిపిత్రేచ పంచమేహనిశుద్ధ్యతి॥

తా॥ బహిష్ఠయైన స్త్రీ నాల్గవదినమున స్నానముచేసిన శుద్ధియగును గాని దేవపితృకార్యము విషయమై అయిదవ దినమందు శుద్ధిగలది యగునని ప్రభాసఖండము నందు చెప్పఁబడెను.

పాదప్రక్షాళనవిధిః. శ్లో॥ మండలాత్పశ్చిమేభాగే బహిర్దేశస్థితో ద్విజః । తత్రైవవిసృజేత్పాద్యం క్షాళనంమండలోపరి । ఉదఙ్ముఖోపవిష్టానాం పాదానాం క్షాళన భవేత్ । అన్యథా క్షాళనేశ్రాద్ధే నరాశాఃపితృలోకగాః॥

తా॥ మండలమునకు పడమటి భాగమున పాదములనుంచి పాద్యమును విడువవలయును పాదప్రక్షాళనము పాదములను మండలముమీద నుంచిన పిమ్మట చేయవలయును బ్రాహ్మణుల నుత్తరముఖముగా గూర్చుండబెట్టి పాదప్రక్షాళనము చేయవలయును లేనియడల పితృదేవతలు ఆశారహితులై వెళ్లుదురు.

శ్లో॥ పాదమూలే పితృస్థానం పాదమధ్యేపితామహాః।
ప్రపితామహాస్తుపాదాగ్రే పాదౌప్రక్షాళయే త్క్రమాత్ ॥

తా॥ పాదముల మొదట పితృలును పాదములమధ్యను పితామహులును పాదములచివర ప్రపితామహులు నుందురు పాదప్రక్షాళన చేయవలెను.

### పాదప్రక్షాళనోదక మార్జనవిధిః.

శ్లో॥ దేవపాదోదకంస్నానం స్పర్శనం పిత్ర్యమండలే । ఉభయోస్స్నాన మాప్నోతి పునఃకర్తా౽ధీయ్యతే॥ పితృబ్రాహ్మణపాదాంబు నధార్యం శిరసిక్వచిత్ ॥

తా॥ విశ్వేదేవులయొక్క పాదోదకమును ప్రోక్షణమార్జనము చేసికొనుటయు పితృస్థానముయొక్క మండలమును స్పృశించుటయును కర్తకు స్నానముతో సమానమైనవి. కావున పితృస్థానమందుని మంత్రితుడైన బ్రాహ్మణుని పాదోకమును శిరస్సున ధరింపగూడదు. మండలమును మాత్రము స్పృశింపవలయును.

ఆచమనప్రకారః. శ్లో॥ మండలాత్పూర్వతోదేవాః పిత్ర్యవిప్రాస్తథోత్తరే।
కర్తాచైవతదీశాన్యే అన్యత్రరుధిరోపమం॥

తా॥ మండమునకు తూర్పుగా విశ్వేదేవుడును ఉత్తరమున పితృబ్రాహ్మణుడును కర్త యీశాన్య భాగమందును గూర్చుండి యాచమనము జేయవలయును. దీనికి వ్యతిరేక స్థలములయందుండి యాచమనము జేసినయెడల కర్తపానముతో సమానమగును.

శ్లో॥ కర్తురాచమనాత్పూర్వం భోక్తురాచమనం యది ।
శునోమూత్రసమంతోయ మిత్యేవంమనురబ్రవీత్ ॥

తా॥ కర్తయాచమనము జేయుటకంటె ముందు భోక్తయాచమనము జేసిన యెడల శునకమూత్రపానముతో సమానమని మనువు చెప్పెను.

గంధధారణమ్. శ్లో॥ చందనం పితృకార్యేషు ఫాలమధ్యేవినిక్షిపేత్ ।
కంఠేకక్షేతథాపృష్ఠే నిరాశాఃపితరోగతాః॥

తా॥ పితృకార్యములయందు ముఖమునందే మంచిగంధమును ధరించవలయును గాని కంఠమునందును, భుజములయందును, వీపునందును, ధరించినయెడల పితృదేవతలు ఆశారహితులై వెళ్లిపోవుదురు.

పరివేషణవిధిః. శ్లో॥ మధ్యేఅన్నం ప్రతిష్ఠాప్య దక్షిణేఘృతపాయసె ।
శాకాదిపురతశ్చైవ అంతెనూపస్తథైవచ ॥

తా॥ అన్నమును మధ్యప్రదేశమందును దక్షిణభాగమునందు నేతిదొన్నెయు పాయసము దొన్నెయు, కూరలు మొదలగునవి ముందరను పప్పు చివర నుంచవలయును.

భోక్తురన్న స్పర్శ నిషేధః.

శ్లో॥ అత్యక్తమన్నం విప్రస్తు పాణినా పునసంస్పృశేత్ ।
స్పృశేతేయది మూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్ ॥

తా॥ అన్నమును త్యక్తము చేయక పూర్వము భోక్త ముట్టుకొనఁగూడదు. అజ్ఞానముచే ముట్టుకొనినయెడల రౌరవమను నరకమును బొందును.

పరివేషణ పాత్రాణి. శ్లో॥ హస్తదత్తాస్తుయేస్నేహా ల్లవణవ్యంజనానిచ దాతారం నోపతిష్ఠంతి భోక్తా భుంజితకిల్బిషం॥ సౌవర్ణ రజితాభ్యాంచ ఖడ్గేనోదుంబరేణచ । దత్తమక్షయ్యతాం యాతి ఫల్గుపాత్రేణి వాప్యథ ॥ పాకం సర్వం సమానీయ నివేద్యచ పృథక్ పృథక్ । విధినా దైవపూర్వంతు పరివేషణ మాచరేత్॥

తా॥ లవణము కూరలు మొదలగునవి చేతితో వడ్డింపగూడదు అట్లుంచబడిన పదార్థములు కర్తకు ఫలమునియ్యవు. వానిని భుజించినయెడల భోక్త పాపమును భుజించినట్లే యగును. కాఁబట్టి బంగారము వెండి మొదలగు పాత్రములతోను మేడికొయ్య మొదలగు వానితో జేయబడిన పాత్రములతోను వడ్డించిన పదార్థము విశేషమైన ఫలము నొసగును. కాఁబట్టి యిట్లు వండిబడిన సమస్తపదార్థములను వేరువేరుగా మొదట విశ్వేదేవస్థానమందును పిమ్మట పితృస్థానము నందును నుంచవలయును.

మధుదానవిధిః. శ్లో॥ శ్రాద్ధేహి మధుమంత్రేణ మధుదేయం ప్రయత్నతః। మధ్వభావే జపేన్మంత్రం సుధాపానసమం భవేత్ ॥ మధ్వలాభేయదిగుడం యోదద్యాత్సర్వకర్మసు । వ్యర్థం భవతి తచ్ఛ్రాద్ధ మితి శాతాతపోబ్రవీత్ ॥

తా॥ శ్రాద్ధమునందు (మధువాతా) అనుమంత్రము నుచ్చరించి తేనె నుంచవలయును అది సంభవించకుండినయెడల మంత్రమును జపించిన చాలును. అమృతపానము జేసిన ఫలము కలుగును. మఱియు తేనె దొరకనియెడల బెల్లము నుంచిరేని యాశ్రాద్ధము వ్యర్థమగునని శాతాతపుఁడు చెప్పెను.

అథ వికరవిధిః. శ్లో॥ భుంజానేషుచ విప్రేషు పిండదానం విధీయ్యతే ।
వికిరంతు తతఃపశ్చాత్తత ఉచ్ఛిష్టపిండకం॥

తా॥ బ్రాహ్మణులు భుజించినవారై యుండగా పిండప్రదానము జేయవలయును. అటుపిమ్మట వికిరాన్నము నుంచవలయును. అనంతరము ఉచ్ఛిష్టపిండము నుంచవలెను.

శ్లో॥ సర్వవర్ణికమన్నాద్యం సన్నియాప్లావ్యవారిణి ।
సముత్సృజేద్భుక్తవతా మగ్రతో వికిరం భువిః

తా॥ ఆవికిరాన్నమును జలములో బాగానుంచి యాజ్ఞోక్తులయొక్క ముంద రను భూమియందు విడువవలయును.

శ్లో॥ శ్రాద్ధేషువికిరందత్వా యోనాచామేన్మతిభ్రమాత్ ।
పితర స్తస్యమణ్మాసంభవంతి త్యుచ్ఛిష్టభోజనాః॥

తా॥ శ్రాద్ధములయందు వికిరాన్నమునుంచి పిమ్మట అజ్ఞానముచే నాచ మనము జేయకుండినయెడల వాని పితృదేవతలు ఆరుమాసములపర్యంత ముచ్ఛిష్ట మును భుజించుచుందురు.

పిండప్రధానవిధిః. శ్లో॥ సర్వమన్నముపాదాయ సతిలందక్షిణాముఖః॥
ఉచ్ఛిష్టసన్నిధౌపిండాన్ ప్రదద్యాత్పితృయజ్ఞవత్ ॥

తా॥ పాత్రమునందుంచబడిన యన్నము నంతియు నువ్వులతో కలిపి పిండ ములనుజేసి వానిని పిండపితృయజ్ఞ ప్రకారముగా దక్షిణాభిముఖుడై పిండప్రదా నము జేయవలయును.

ఉచ్ఛిష్టసన్నిధి స్వరూపమ్. శ్లో॥ పిత్రాణామాసనస్థానాదగ్రతః త్రిష్వ రత్నిషు । ఉచ్ఛిష్టసన్నిధానాంతం నోచ్ఛిష్టాసనసన్నిధౌ । అరత్నిమాత్రము త్సృజ్య పిండం తత్రప్రదాపయేత్.

తా॥ పితృబ్రాహ్మణులుండు కూర్చుండిన ప్రదేశము మొదలు ముందు మూడు పిడికిళ్లు దూరముండవలయును. ఉచ్ఛిష్టపాత్రమునకు పిడికిలిదూర ప్రమాణము విడిచి అక్కడ పిండప్రదానము జేయవలయును.

శ్లో॥ యత్రోపస్పృశతోవాపి పాత్రసవంతివబిందవః॥ మధుసర్పిస్తిలయుతాం త్రీపిండాన్నిర్వపేత్సుతః। జానుకృత్వాతథాసవ్యం భూమౌ పితృపరాయణః॥

తా॥ నీళ్ళు స్రవించినప్పటికిని కలియకుండునట్టి ప్రదేశమునందు జేయ వలయును తేనె, నెయ్యి, నువ్వులు, మొదలగువానితో గలిపి మూడు పిండములను జేసి యెడమ మోకాలును భూమియందుంచి పితృదేవతలయందు భక్తిగలవాడై భూమియందు పిండప్రదానము జేయవలెను.

ఉచ్ఛిష్టపరిత్యాగః శ్లో॥ ఉచ్ఛిష్టాన్నంపరిత్యాజ్యం దేవానాంసర్వభాగతః పిత్రాణాం పశ్చిమేభాగే విప్రోచ్ఛిష్టంప్రదాపయేత్॥ అసంస్కృతేభ్యోదాసేభ్య స్త్యజేదుచ్ఛిష్టసన్నిధౌ । నత్యజేత్ తృప్తిపాపాభ్యామన్నధానరకంవ్రజేత్। అసం స్కృతప్రమీతానాం త్యాగినాంకులయోషితాం । ఉచ్ఛిష్ట భాగదేయంస్యా ద్దర్భే చవికిరేచ్చయత్॥

తా॥ ఉచ్ఛిష్టాన్నమును పితృదేవతల పాత్రమునకు పశ్చిమభాగమున విడువవలయును. సంస్కారములేనట్టివారును తమరికిని ఆశ్రయించుకొని మృతినొందినట్టివారికి ఉచ్ఛిష్టసన్నిధానమందు ఉచ్ఛిష్టమును విడువవలయు. తాను తృప్తినొంది విడువవలయునుగాని తాను ఆకలితోనుండి విడువఁగూడదు. అట్లు విడిచినయెడల నరకమును బొందును సంస్కారము లేకుండా మృతినొందినట్టి వారికిని విడువబడిన స్త్రీలకును చెందునట్లు ఉచ్ఛిష్టభాగమును దర్భలయందు విడువవలయును.

భోజనపాత్రచాలనమ్. శ్లో॥ ఉచ్ఛిష్టపితృపాత్రేషు ధర్మమిశ్రంకరోతియః తత్పితానరకంయాతి యావచ్చంద్రదివాకరౌ॥ అర్థ్యకేషుచపాత్రేషు స్వస్తికుర్వంతి యేద్విజాః॥ నిరాశాఃపితరస్తస్య శాపందత్వాసుదారుణం । పాత్రాణిచాలయే చ్ఛ్రాద్ధే స్వయంశిష్యోథవాసుతః । నస్త్రీభిర్నచబాలేన నాసజాత్యాకథంచన । శ్రాద్ధేతూచ్ఛిష్టపాత్రాణి ఖనిత్వైవతునిక్షిపేత్ । పునరుచ్ఛ్వాసయేచ్ఛ్వాది యథా నస్పృశతేతథా ॥

తా॥ భోక్తలయొక్క యుచ్ఛిష్టపాత్రములయందు బూడిద చల్లినయెడల వానియొక్క తండ్రి సూర్యచంద్రులుండునంతకాలము నరకమును బొందును, పాత్రలను తీసివేయకముందు బ్రాహ్మణులు స్వస్తిచెప్పినయెడల వానిని పితృదేవతలు కఠినమైన శాపమునిచ్చి యాకారహితులై వెళ్ళిపోవుదురు. కాఁబట్టి తానుగాని, తనశిష్యుఁడుగాని, తన కుమారుఁడుగాని, భోక్తృభోజనపాత్రములను తీసివేయవలయును. స్త్రీలుగాని, పిల్లలుగాని, విజాతీయులుగాని, తీయఁగూడదు శ్రాద్ధములయందు భోక్తలయొక్క యుచ్ఛిష్టపాత్రములను కుక్కలు మొదలగునవి పెల్లగించకుండునంత లోతుగొయ్యిత్రవ్వి దానిలో వేసి పూడ్చవలయును.

శ్రాద్ధశేషాన్న భోజనవిధిః.

శ్లో॥ తతశ్చవైశ్వదేవాంతే సభృత్యసుతబాంధవః । భుంజీతాతిథి సంయుక్త స్సర్వం పితృనిషేవితం॥ శ్రాద్ధమన్న మనుజ్ఞాతం భుంజీత తదనంతరం॥ ఇష్టైర్దీనాంస భుంజీతబుద్ధిమాంగ్స్న సమాహితః॥ పృథక్పాకేన వైశ్వదేవకరణేపి శ్రాద్ధ శేషాన్న భోజనం కర్తవ్యం॥

తా॥ అటుపిమ్మట వైశ్వదేవముచేసికొని పితృదేవతులచే ననుజ్ఞపొందబడిన పితృశేషమునంతయు తాను భృత్యులు, తనయులు, బంధువులు, అతిథులు, మొద

లగువారితోటి ఇష్టులు మొదలగు వారితోనుగూడి సావధానమనస్సుగలవారలై యథేష్టముగా భుజింపవలెను వేరుపాకమునందు వైశ్వదేవముజేసి శ్రాద్ధశేషాన్నమునే కర్త భుజించవలయును.

శ్లో॥ ప్రదక్షిణమను వృజ్యభుంజీత పితృసేవితం॥ శ్రాద్ధదినేపితృశేషాభావేపిపాకాంతరం కృత్వా అవశ్యంభోజనం కర్తవ్యం॥ అభోజనేదోషః॥

తా॥ భోక్తలకు ప్రదక్షిణముజేసి వారిని కొంతదూరము పంపించి పితృశేషమును భుజించవలయును పితృశేషము లేకపోయినను వేరువంటచేసి యాదినమున భుజించవలయునుగాని కర్త ఉపోష్యము చేయరాదు.

శ్లో॥ శ్రాద్ధంకృత్వాతుయో విప్రః భుంక్తేథ కదాచన। దేవాహవ్యం నగృహ్ణంతి కవ్యానిపితరస్తథా। పృథక్పాకేన వైశ్వదేవ కరణేపి శ్రాద్ధశేషాదేవ భోజనం కర్తవ్యం॥

తా॥ బ్రాహ్మణుండైనను శ్రాద్ధముజేసి భుజింపకుండునో ఆశ్రాద్ధమునందు దేవతలు హవ్యమును గ్రహింపరు. పితృదేవతలు కవ్యమును గ్రహింపరు. భిన్నపాకముచే వైశ్వదేవముజేసినను శ్రాద్ధశేషమునే భుజింపవలయును.

శ్లో॥ దంతధావనమభ్యంగం నఖకేశనికృంతనం।
కర్తాకుర్వీత పూర్వేద్యు రోభక్తాచైవపరేహని॥

ఏకాదశ్యాదు పవాసాదినియమే.

శ్లో॥ ఉపవాసోయదానిత్యః శ్రాద్ధంనైమిత్తికం భవేత్।
ఉపవాసంతదాకుర్యా దాఘ్రాయపితృసేవితమ్॥

తా॥ నిత్యముగా జరుపుచుండెడి యుపవాసదినమునందు శ్రాద్ధము సంభవించినయెడల శ్రాద్ధమునుబెట్టి పితృశేషము నాఘ్రాణించి యుపవాసము చేయవలయును.

వైశ్వదేవవిధిః. శ్లో॥ శ్రాద్ధం నిర్వర్త్యవిధివ ద్వైశ్వదేవాదికంతతః।
కుర్యాద్భిక్షాంతతోదద్యా ద్ధంతకారాదికంతతః॥

తా॥ యథాశాస్త్రముగా శ్రాద్ధమును సమాప్తిని బొందించి అనంతరము వైశ్వదేవము మొదలగు వానినిజేసి బంధువులు మొదలగువారితోగూడ భుజించవలయును.

శ్రాద్ధాంగ తర్పణవిధిః.

శ్లో॥ తతఃపరేహ్ని కుర్వీత తర్పణంపురుషస్సుధీః। తచ్ఛ్రేష్ఠైస్తిల దర్భైస్తు పాత్రిసాన్నైత్వా మృత్తైర్జలైః। శ్రాద్ధేయావంతఉద్దిష్టా పాత్రస్తానేవతర్పయేత్

తర్పణంత్వమృతం ప్రాతర్ద్వితీయే ప్రహారేపయః। తృతీయేనజలమిత్యాహుః చతుర్థే రుధిరంభవేత్ తస్మాచ్ఛ్రాద్ధంతు పూర్వేద్యుఃకృత్వాస్నాత్వాపరేహని ప్రాతః పితౄంశ్చ సంతర్ప్య పశ్చాత్సంధ్యాదికారయేత్। పరేహన్యుషసిస్నాత్వా కృత్వా శ్రాద్ధాంగతర్పణం। పునస్స్నాత్వైవకుర్వీత ప్రాతస్సంధ్యాంసమాహితః। ఉదితేతు రవౌ స్నాత్వాసంధ్యాం కృత్వైవతర్పయేత్। యస్తుతర్పయేతి ప్రాతఃకృత్వా శ్రాద్ధంపరేహని। పరేద్యుశ్శ్రాద్ధకృన్మర్త్యో యోనతర్పయతెపితౄన్ అతృప్తాః పితరస్తస్య శాపందత్వావ్రజంతితే ॥ తీర్థశ్రాద్ధేగయాశ్రాద్ధే శ్రాద్ధేప్రత్యాబ్దికేపిచ। పరేహనిద్విజః కుర్యాత్తర్పణం తిలసంయుతం ॥

తా॥ అటుపిమ్మట విద్వాంసుఁడైన పురుషుఁడు శ్రాద్ధమునందు మిగిలిన తిలలు దర్భలచేతను మరునాఁడుదయమున స్నానముజేసి పరిశుద్ధమగు జలముచే పూర్వమునందు శ్రాద్ధమునందు ఉద్దేశించబడిన పితృవర్గమును గుఱించి తిలతర్పణము జేయవలయును. ఆచేయఁబడిన తర్పణసంబంధమగు జలము ప్రాతఃకాలమునందు జేసినయెడల అమృతముతో సమానమనియు రెండవజాములో జేసినయెడల పాలతో సమానమనియు, మూడవజాములో జేసినయెడల జలముతోసమానమనియు నాల్గవజామున జేసినయెడల రక్తముతో సమానమనియు, చెప్పఁబడినది కాఁబట్టి పూర్వదినమునందు శ్రాద్ధముపెట్టి మరునాఁడుదయమున స్నానముజేసి. పితృదేవతుల గుఱించి తర్పణముజేసి పిమ్మట సంధ్యావందనాది నిత్యకృత్యములను జేసికొనవలయును. మరునాఁడుదయమున స్నానముజేసి శ్రాద్ధాంగతర్పణముజేసి తిరిగి స్నానముజేసిన పిమ్మట ప్రాతస్సంధ్యావందనాది నిత్యకృత్యములను జేయవలయు. సూర్యోదయమగుచుండగ సంధ్యావందనము జేయకయే శ్రాద్ధాంగతర్పణమును చేయవలయును ఎవ్వఁడు శ్రాద్ధముపెట్టి మరునాఁడుదయమున శ్రాద్ధాంగతర్పణమును జేయుచున్నాడో వాని పితృదేవతలు తృప్తినొందుచున్నారు. కోపమును పొందరు నిశ్చయము శ్రాద్ధమును పెట్టినపురుషుఁడు మరునాడు శ్రాద్ధాంగతర్పణమును జేయకుండినయెడల వాని పితృదేవతలు తృప్తిలేనివారలై వానికి శాపమిచ్చి వెళ్ళిపోవుచున్నారు. తీర్థశ్రాద్ధమునందు గయాశ్రాద్ధమునందు ప్రత్యాబ్దిక శ్రాద్ధమునందు పరేహని తర్పణము తిలసహితముగ చేయవలయును.

## మహాలయ తర్పణమ్.

శ్లో॥ శ్రాద్ధాంగం ప్రత్యహందద్యాత్పక్షశ్రాద్ధాంగ తర్పణమ్।
సకృన్మహాలయేశ్రాద్ధే సతిలంతుపరేహని॥

తా॥ పక్షశ్రాద్ధాంగతర్పణము శ్రాద్ధానంతరమందే జేయవలయును. మహాలయశ్రాద్ధమునందు మరునాడు తిలతర్పణము జేయవలెను.

### పితృవ్యాది కారుణ్యశ్రాద్ధే తర్పణవిధిః.

శ్లో॥ శ్రాద్ధాంగతర్పణంకుర్యా త్సతిలంతుపరేహని ।
పిత్రోశ్చవిషయ ఏవస్యా న్నచాన్యవిషయేభవేత్ ॥

తా॥ మరునాడు తిలసహితముగ తర్పణముచేయుట తల్లిదండ్రుల విషయము కాని యితరుల విషయముకాదు.

### సపిండీకరణాను మాసికాదిషు తర్పణవిధిః,

శ్లో॥ పక్షశ్రాద్ధేహిరణ్యేచ పశ్చాద్దద్యాత్తిలోదకం । తథాచైవాష్టకాశ్రాద్ధే శ్రాద్ధేచైవానుమాసికే ॥ వృద్ధిశ్రాద్ధేసపిండేచ ప్రేతశ్రాద్ధానుమాసికే । పరేహని విమోకేచ నకుర్యాత్తిలతర్పణం । కృత్వానుమాసికం శ్రాద్ధం సపిండీకరణాత్పరం । వైశ్వదేవ తతఃకుర్యా త్తర్పణం తిలసంయుతం॥ సపిండీకరణశ్రాద్ధే ప్రేతశ్రాద్ధాను మాసికే । సంవత్సరవిమోకేచ నకుర్యాత్తిలతర్పణం ॥ ఇదంవచనం పరేహని తర్పణ నిషేధపరం అన్యధాబహుస్మృతి విరోధస్స్యాత్ ॥

తా॥ పక్షశ్రాద్ధమునందు హిరణ్యశ్రాద్ధమునందు శ్రాద్ధానంతరమే తిలతర్పణ చేయవలయును. అష్టకాశ్రాద్ధమందును అనుమాసిక శ్రాద్ధమునందును వృద్ధిశ్రాద్ధ మునందును సపిండీకరణ శ్రాద్ధమందును ప్రేతశ్రాద్ధమందును పరేహని తిలతర్ప ణము చేయనక్కరలేదు సపిండీకరణముచేసి మాసికముపెట్టి పిమ్మట వైశ్వదేవముచేసి అనంతరము తిలతర్పణము చేసికొనవలయును. సపిండీకరణమునందును ప్రేతశ్రాద్ధ మునందును, మాసికమునందును సంవత్సర విమోకమునందును తిలతర్పణము చేయ గూడదనెడుమాట పరేహానితర్పణవిషయము గాని తిలతర్పణవిషయము గాదు. ఇంత కంటె వ్యతిరేకముగ జెప్పినయెడల ననేకస్మృతులకు విరోధముగా నుండును.

### సువాసినీశ్రాద్ధే సువాసినీ భోజనవిధిః.

నిర్ణయసింధౌ॥ శ్లో॥ మాతృశ్రాద్ధేతు సంప్రాప్తే బ్రాహ్మణైస్సహ భోజనం సువాసిన్యైప్రదాతవ్యమితిశాతాతపోబ్రవీత్ ॥ భర్తురగ్రేమృతానారీ సహదాహేనవామృతా । తస్యాస్థానేషుభుంజీత విప్రైస్సహ సువాసినీ ॥

తా॥ తల్లి సువాసినీగనుండి మృతినొందినయెడల అట్టితల్లి యాబ్దికమునందు బ్రాహ్మణులతోగూడ నొక ముత్తైదునకు భోజనము పెట్టవలయునని శాతా తపుఁడు చెప్పెను. పెనిమిటికంటె భార్య ముందు మరణించినను పెనిమిటితో సహగమనము చేసినను యామెశ్రాద్ధమునందు భోక్తలతోగూడ ముత్తైదువను భుజింపచేయవలయును.

ఆశౌచదినే శ్రాద్ధవిఘ్నే.

శ్లో॥ దేయంపిత్రాణాం శ్రాద్ధంతు ఆశౌచంజాయతేయదా ।
ఆశౌచేతువ్యతిక్రాంతే తేభ్యశ్శ్రాద్ధం ప్రదీయతే ॥

తా॥ జాతాశౌచ మృతాశౌచదినములలో శ్రాద్ధము సంభవించినయెడల ఆశౌచము నివృత్తియగు దినంబున శ్రాద్ధము పెట్టవలెను.

రజస్వలా కర్తృ భర్తృ శ్రాద్ధవిధిః.

శ్లో॥ అపుత్రాతుయదాభార్యా సంప్రాప్తే భర్తురాబ్దికే । రజస్వలా భవేత్సాతు కుర్యాత్తత్పంచమేహని। అశుద్ధాస్యాత్పంచమేహ్ని స్నాత్వానారీ రజస్వలా । దైవేకర్మణిపిత్ర్యేచ పంచమేహనిశుద్ధ్యతి ॥

తా॥ సంతానములేనట్టి స్త్రీ బహిష్ఠయుండగ యామె భర్తయొక్క శ్రాద్ధము సంభవించెనేని అయిదవదినమందు స్నానముచేసిన పిమ్మట పెట్టవలయును. బహిష్ఠయైన స్త్రీ అయిదవదినమందు స్నానముచేసినయెడల దేవపితృకార్యములకు నర్హురాలుగా నుండును.

అమశ్రాద్ధం గృహీత్వాతు శ్రాద్ధాంతరభోజనేదోషః.

శ్లో॥ ఆమశ్రాద్ధంగృహీత్వాతు యోన్యశ్రాద్ధంతుభుంజతే ।
పతంతిపితర స్తేషాం రౌరవేనరకేధ్రువం ॥

తా॥ ఎవ్వడైనను ఆమశ్రాద్ధమునందు పదార్థమును తీసికొని తిరిగి అన్న శ్రాద్ధమునందు భోక్తగా నుండెనేని వాని పితృదేవతలు రౌరవమను నరకమును పొందుచున్నారు.

ఆచమనవిధిః. శ్లో॥ ఆదావంతేచపాద్యేచ విష్టరేచవిశేషతః ।
వికిరేపిండదానేచ షట్స్వాచామనం స్మృతమ్ ॥

తా॥ మొదటను చివరను పాద్యసమయమందును విష్టరమిచ్చినప్పుడును వికిరసమయమందును పిండప్రదానకాలమందును ఈయారు సమయములయందును కర్త ఆచమనము చేయవలయును.

శ్రాద్ధేతక్ర (మజ్జిగ) దాన నిషేధః.

శ్లో॥ పైతృకేషుచవిప్రేభ్యో దద్యాత్తక్రంతుమూఢధీః।
తత్తక్రం రక్తమిత్యాహుః కాశ్యపిర్గార్గ్యగౌతమాః॥

తా॥ పితృకార్యములయందు భోక్తలకు మజ్జిగ వడ్డించినయెడల యామజ్జిగ రక్తముతో సమానమని కాశ్యపగార్గ్యులు గౌతముఁడు మొదలగువారలు చెప్పిరి

పాదప్రక్షాళనమ్. శ్లో॥ మండలాత్పశ్చిమేభాగే స్వాగతంతువిధీయతే।
పాద్యంతద్యాచ్ఛత్రైవ క్షాళనం మండలోపరి ॥

తా॥ మండలమునకు పశ్చిమభాగమునందు పాదములనుంచి స్వాగతమును పాదమును చెప్పవలయును మండలముమీద పాదములనుంచిన పిమ్మట ప్రక్షాళనము చేయవలెను.

రజస్వలాపత్యోశ్శ్రాద్ధ నిమంత్రణనిషేధః.

శ్లో॥ రజస్వలాయాభర్తారం సూతికాయాశ్చవైపతిం।
భాండస్పర్శన పర్యంతం శ్రాద్ధేతునవియోజయేత్।

తా॥ భోక్తభార్య బహిష్ఠయైయుండగగాని లేక ప్రసవమై యుండగగాని, శ్రాద్ధములయందు నిమంత్రణఁజేయఁగూడదు భోక్త భార్యకు పాత్రలు మొదలగు వానిని ముట్టుకొనుటకు యోగ్యత కలిగినప్పుడు వానికి అర్హత కలుగును.

పితృపుత్రయోరేకపాం క్షౌరనిషేధః.

శ్లో॥ పుత్రపిత్రోస్సకృత్కాలే క్షౌరకర్మప్రవర్తతే। పుత్రస్స్యాదా క్షురం తస్య పితుస్తుతదనంతరం। యస్తుక్షౌరదినేమోహాత్ మృత్తికా స్నానమాచరేత్। ఆశౌచంత్రిదినంతస్య పునఃక్షౌరేణశుద్ధ్యతి॥

తా॥ తండ్రి కుమారులిద్దఱు ఒక్కదినంబున క్షౌరము చేయించుకొనవలసినప్పుడు ముందుకుమారుఁడు చేయించుకొనిపిమ్మట తండ్రి చేయించుకొనవలయును. ఎవఁడైనను క్షౌరము చేయించుకొనిన దినమునందు మృత్తికస్నానము తెలియకచేసిన యెడల వానికి మూడుదినముల పర్యంతము ఆశౌచముండును. పిమ్మట తిరిగి క్షురకర్మను చేయించుకొనవలయును. తండ్రి కుమాళ్ళు ఏకదినంబున క్షురకర్మ చేయకూడదనట.

శ్లో॥ యథాభోజనకాలేతు వామభాగేస్థితంజలమ్। పానమాత్రసమంతోయం పీత్వాచాంద్రాయణంచరేత్। స్కంధేవాటేపాషాణే ఆర్ద్రవస్త్రంనిక్షిపేత్। నిక్షిపేద్యది మూఢాత్మా సచేలస్నానమాచరేత్॥

తా॥ భోజనము చేయునప్పుడు జలపాత్రమును ఎడమ భాగమందుంచుకొని జలపానము చేసినయెడల శునకమూత్రమును పానముచేసినట్లగును. అట్లు చేసిన

యెడల చాంద్రాయణము నాచరించవలయును భుజములమీదను, తలుపుమీదను, కాతిమీదను, తడివస్త్రము నుంచగూడదు. తెలియక నుంచినవారు అకట్టు వస్త్రములతోడనే స్నానము చేయవలయును.

రజస్వలాసూతికా పతోద్ధరశుద్ధతా.

శ్లో॥ రజస్వలాచయానారీ ప్రసూతాయాచపాతకే ।
దైవేకర్మణిపిత్ర్యేచ తాసాంభర్తురశుద్ధతా ॥

తా॥ బహిష్టైనదాని పెనిమిటియు, ప్రసవమైనదాని పెనిమిటియు, దేవ పిత్ర్యకార్యముల విషయమై అర్హులుగారు.

వ్యుత్క్రమమృతానాం శ్రాద్ధవిధిః.

వాక్యం ॥ వ్యుత్క్రమేణమృతానాం జీవంతమతిక్రమ్యత దూర్ధ్వగతాభ్యాం ద్వాభ్యాం సహావర్గత్రయం సంపాద్యశ్రాద్ధం కుర్వన్ జీవతికాలాంతరే విలయేసతి తత్సాపిండ్యే త్వరంపునః క్రమసాపిండ్యంకృత్వా క్రమేణవర్గత్రయ ముద్దిశ్య శ్రాద్ధం కుర్యాత్ ॥

తా॥ తండ్రి జీవించియుండగ కుమారుడు మృతినొందినయెడల వర్గత్రయము విషయమై జీవించియున్నవానియొక్క తండ్రితాతల వర్గములుచెప్పి శ్రాద్ధమును చేయవలెను. కొంతకాలమునకు తండ్రికూడ మృతినొందినయెడల సపిండీకరణమైన పిమ్మట క్రమముగా ముగ్గురియొక్క నామములను చెప్పవలయును.

వా॥ ఏకమేవమాసికాన్యపి వర్గత్రయోద్దేశేన ప్రతిమాసమును మాసిక పంజ్ఞయాపార్వణ విధానేనకుర్యాత్ । శ్రాద్ధాంగతర్పణంసద్య యేవకుర్యాత్ ॥ ప్రతిమాసికేః ర్తత్య మాసికాస్యాంతరాయే తస్మాసికీ ముత్తరమాసికేనసహా సమాన తంత్రింకుర్యాత్ ॥ మాసికద్వయయిఘనే ॥ అఘ్యాపాత్రపట్కంకుర్యాత్ ॥ బహుమాసిక మేళనే । త్రిణ్యేవార్ఘ్య పాతాణిత్రయ ఎవపిండాః॥

తా॥ ఈప్రకారముగానే వర్గత్రయముతో ప్రతిమాసమునందు పెట్టునట్టి మాసికములను పార్వణవిధానముగా చేయువలయును శ్రాద్ధాంగతర్పణము తత్కాలమునందే చేయవలయును ఈమాసికములలో నేదైన నొకటి విఘ్నము సంభవించి యాగినయెడల ముందు మాసికముతోకూడ కలిపి సమానముగ జరుపవలయును. అప్పుడు ఆరు అర్ఘ్య పాత్రలను ఆరు పిండముల నుంచవలయును. అనేక మాసికములను బెట్టవలసి వచ్చినప్పుడు మూడు దొన్నెలను మూడు పిండములను మాత్రము నుంచవలయును.

ఏకోద్దిష్టవిధిః. వాక్యం॥ కనిష్ఠభ్రాతృభగినీ పుత్రాదిమాతులాదీనాం। ఏకోద్దిష్ట విధానేన పార్వణైకవత్కుర్యాత్ ॥ తత్రవిశ్వేదేవోపి యేవయేవ ॥ రుద్రసంజ్ఞికో విశ్వేదేవః॥

తా॥ తమ్ముడు, తోబుట్టువు, కుమారుండు, మేనమామ, మొదలగువారికి ఏకోద్దిష్టవిధానముగ నేకపార్వణముగా చేయవలయును. అప్పుడు రుద్రసంజ్ఞికుం డైన విశ్వేదేవు డొక్కడు.

విశ్వేదేవాస్త్రయోదశ.

తద్యథా ॥ శ్లో॥ దక్షస్యదుహితా సాధ్వీ విశ్వానామ ప్రకీర్తితా ।
తస్యాఃపుత్రా మహావీర్యాః విశ్వేదేవాస్త్రయోదశ॥

తా॥ దక్షప్రజాపతియొక్క కుమార్తెయు పతివ్రతయునగు విశ్వ అను పేరు గల యొక స్త్రీ గలదు. ఆమెయొక్క తనయులును మిక్కిలి పరాక్రమవంతులు నగు పదమూగ్గురు విశ్వేదేవతులని చెప్పబడుచున్నారు,

తత్రనియమాః. శ్లో॥ ఇష్టిశ్రాద్ధే దక్షక్రతూ సంకీర్త్యౌవైశ్వదేవకౌ। నాందీముఖే సత్యవసూ సాపిండ్యే కాలకామకౌ । పురూరవార్ద్రవౌచైతౌ పార్వణే సముదాహృతౌ । హేమశ్రాద్ధేధురుచీ తీర్థేధూరివిలోచనౌ । ఏకోద్దిష్టే రుద్రసంజ్ఞో విశ్వేదేవాస్త్రయోదశ ॥

తా॥ ఇష్టిశ్రాద్ధమునందు దక్షక్రతువులిరువురు, నాందీశ్రాద్ధమునందు సత్యవసులు ఇరువురు, సపిండీకరణమునందు కాలకాములిరువురు, ప్రత్యాబ్దికమునందు పురూరవార్ద్రవులిరువురు, హిరణ్యశ్రాద్ధమునందు ధురుచులిరువురు, తీర్థశ్రాద్ధమునందు ధూరివిలోచనులిరువురు, ఏకోద్దిష్టమునందు రుద్రుండొక్కడు మొత్తము పదమూగ్గురు విశ్వేదేవులు.

ఉపవీతినా కర్తవ్యకాలాః.

శ్లో॥ ప్రాణాయామేనమస్కారే స్నానేచైవప్రదక్షిణే।
పైతృకేప్రీతికృత్యేపి ఉపవీతంవిధీయతే ॥

కించ॥ స్వాగతే స్వస్తివచనే న్నపరివేషణేఘర్ఘ్యదానేభివాదనే గోత్రవృద్ధౌ దక్షిణాదానే విసర్జనే చోపవీతమేవ ।.

తా॥ ప్రాణాయామమునందును నమస్కారమందును, స్నానమునందును, ప్రదక్షిణమందును, పితృకార్యసంబంధమైన దానాదులందు పైన చెప్పినవాటి యందు విపరీతముగానే చేయవలయును. స్వాగతము, స్వస్తివచనము, అన్నము వొడ్డించుట. అర్ఘ్యమిచ్చుట, నమస్కారముచేయుట, గోత్రవృద్ధిచెప్పుట, దక్షిణ నిచ్చుట, విసరనచేయుట, ఈ కార్యములయందు సవ్యముగానే చేయవలయును.

